# విస్డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాస పత్రిక

:చందా వివరాలు:

| | | |
|---|---|---|
| 3 సంవత్సరాల చందా | రూ. | 140/- |
| సంవత్సర చందా | రూ. | 48/- |
| ఎయిర్‌మెయిల్ (1 సం) | రూ | 200/- |
| సీ మెయిల్ (1 సం) | రూ. | 100/- |

చందా పంపవలసిన చిరునామా
రత్నా ఏజన్సీస్
2, దేశికారోడ్, ఆళ్వారుపేట వద్ద
మద్రాసు - 600 004
ఫోను: 4990327

## ఈ సంచికలో

మార్చి 1996



:ముఖచిత్రం:
కలర్ ట్రాన్స్‌పరెన్సీ
జగన్మోహన్

★ తెలుగు విస్డమ్‌కు ఇది 15వ సంవత్సరం ★

## మనసును మంచి ఆలోచనలపై లగ్నం చేయండి



జేమ్స్ ఎలెన్

రోజూ మనసును మంచి ఆలోచనలపై లగ్నం చేయడం వల్ల వివేకంతో కూడుకున్న పవిత్రమైన భావాలను గురించి ఆలోచించే అలవాటు వస్తుంది. ఈ అలవాటు వివేకంతో కూడుకున్న పవిత్రమైన పనులకు దారితీస్తాయి. విడువకుండా మంచి ఆలోచనలను మరీ మరీ గుర్తుకు తెచ్చుకోవడం వల్ల అవి చివరకు మనలో అంతర్భాగం అవుతాయి. మనం పవిత్రులం అవుతాము. మన స్వభావం సహజంగా మంచి కార్యాలలో లగ్నమై

(మిగతా 3 వ పేజీలో)

సంతోషంగా జీవించాలంటే తప్పక హాస్యప్రియులుగా ఉండాలి. మనం ఎడారిలో సంచరిస్తున్నప్పుడు సముద్రం ఒడ్డుపై నడుస్తున్నామనుకోవాలి. మనముందున్న ఆకాశంలో కారుమేఘాలు కమ్ముకుంటే వాటి వెనక సూర్యుడు దాగున్నాడని గుర్తించాలి. ఎందుకో తెలుసా? ప్రతి కారు మబ్బు ముసుగులో ఆశాకిరణం దాగుంటుంది. శిశిరము వచ్చిందంటే వసంతం రానున్నదనేగా అర్థం. ఆశావాదం మనిషికి ఆరోగ్యాన్ని ప్రసాదిస్తుంది. ఆశ పురోగతికి రాజబాటలాంటిది. ఆశావాదికి జీవితం గొప్పవరం. ఆనందంతో జీవించాలని తెలియజేసే తారకమంత్రం.

గతకాలం కంటే వచ్చేకాలం బాగా ఉంటుందన్న భావనను ఆశ మానవుడిలో రేకెత్తిస్తుంది.

పెద్దలు నడిచిన బాటలు, మనం కూడా గొప్పవారలము కాగలమని మనకు చెప్తున్నాయి. షేక్స్‌పియర్ వాత రోగంతో బాధపడుతున్నప్పుడు 'హేమ్‌లెట్' అన్న గొప్ప నాటకాన్ని రచించాడు. సువిఖ్యాత రచయిత స్విఫ్ట్ (Swift) మూర్ఛరోగిగా ఉండేవాడు. ఇబ్సెన్ చక్కెర వ్యాధిగ్రస్థుడు. డాక్టర్లు ఇక కొన్ని నెలల్లో నీవు చనిపోతున్నావని చెప్పిన తరువాత హాండెల్ (Handel) తన జీవితపు అతిగొప్ప సంగీత

---

"మంచి మనస్సే గొప్ప తపస్సు

— రోజ్‌పాల్

రచన చేసాడు. జీవితాంతం మీరు అవిటివాడిగా ఉండాలని 39 సంవత్సరాల వయసులో ఉన్నప్పుడు డాక్టర్లు రూజ్వెల్ట్‌తో అన్నారు. కానీ అతడు నిరాశ చెందలేదు. జీవితం ఇదిగో ఇప్పుడే ప్రారంభమైందని భావించి ముందుకు సాగుతూ తన జీవిత కాలంలో అమెరికా అధ్యక్షుడి పదవిని చేపట్టేంత ఎత్తుకు పెరిగాడు.




మన చుట్టూ ఉన్న వ్యక్తులను - చంక కఱ్ఱతో ముందుకు సాగుతూ భుక్తి కోసం వస్తువులను అమ్మే కుంటివారినీ లేదా వస్తువుల సౌందర్యాన్ని తన చేతులతో తడిమి చూడగల గుడ్డివారినీ - చూచి మనం వారిని ప్రశంసిస్తుంటాము. కనులుండీ, చెవులుండీ, ఆరోగ్యకరమైన శరీరం ఉండీ ఇంకా ఫిర్యాదులు చేస్తూ విసుగుతో బాధపడే వ్యక్తులకు పై వ్యక్తులు చక్కటి గుణపాఠాన్ని నేర్పుతున్నారు. నిజం చెప్పాలంటే మనం ఉన్న పరిస్థితులు కావు మన స్వభావమే మనల్ని సంతోషంగా లేదా బాధతో జీవించేలా చేస్తుంది.

నిరాశ నిస్పృహలు మిమ్మల్ని అలుముకున్నప్పుడూ, మీరు ఓడిపోతున్నప్పుడు, మీరు తడబడుతున్నప్పుడూ భగవంతుడు మీకిచ్చిన వరాలను గుర్తు తెచ్చుకోండి.

●

[illegible]

*మధ్య జకార్తాలోని 61 జల్. ఇమామ్ బొంజాల్ (Jl Imam Bonjol)లో ఉన్న ది బాంక్ బుమి దయా (The Bank Bumi Daya) భవనం ఇండోనేషియా రాజధాని నగరం జకార్తాలో అతి ఎత్తైన భవనం. దీనిలో 32 అంతస్థులు ఉన్నాయి.*

(2 వ పేజీ తరువాయి)

పరిశుద్ధమైన శాంతియుత జీవితం వైపు మొగ్గు చూపుతుంది.

మనలోని చాలామంది పొత్తు కుదరని కోరికలకూ, మనో వికారాలకూ, భావోద్రేకాలకూ, లేనిపోని ఊహలకు గురి అవుతుంటారు. ఆ కారణంగా వారి జీవితంలో చికాకు, బాధ, దుఃఖం, అనిశ్చిత, చోటు చేసుకుంటాయి.

కానీ ధ్యానంను అలవాటు చేసుకున్న వ్యక్తి ఆదర్శంతో కూడుకున్న గొప్ప పనులను చేయాలన్న సూత్రాన్ని పాటిస్తూ నిదానంగా విజయాన్ని సాధిస్తాడు.

●

ధనార్జన లాగా జ్ఞానార్జన అన్న కోరిక కూడా పొందే కొద్దీ పెరుగుతూ ఉంటుంది

— లారెన్స్ స్టెర్న్

# సుప్రసిద్ధ [illegible]

స్వామి ఓంకార్

ఒక పవిత్ర సన్యాసి ఆశీస్సులతో తన తల్లితండ్రులకు వరప్రసాదంగా వెంకటరావు ఆంధ్రప్రదేశ్ తూర్పు గోదావరి జిల్లాలోని పిఠాపురంలో జన్మించారు. బాల్యదశ నుంచే వెంకటరావు ఆధ్యాత్మిక పురోభివృద్ధి వైపు మొగ్గుచూపారు. పాఠశాల ప్రార్థన




సమావేశాలలో జరిగే వేదమంత్రాల ఉచ్ఛరణను భగవద్గీత, బైబిల్ మొదలైన ధార్మిక గ్రంధాల పారాయణాన్నీ వీరు చాలా శ్రద్ధగా వినేవారు. బాల్యం నుండే ప్రణవమంత్రంలో లీనమైపోయేవారు. అప్పుడప్పుడు మంత్రజలంతో తన స్నేహితుల చిన్న చిన్న రోగాలను నయం చేసేవారు.

భగవంతుడి లీలలు విచిత్రంగా ఉంటాయి! వెంకటరావు తంత్రశాస్త్రాన్ని అధ్యయనం చేయడం ప్రారంభించారు. క్రమంగా వారు భగవంతుణ్ణి అన్వేషించ సాగారు. ఇహ జీవితం నుండీ ఆధ్యాత్మిక జీవితంవైపు వారు తమ ప్రయాణాన్ని సాగించారు.

భగవద్ జ్ఞానాన్ని పొందాలన్న దృఢ నిర్ణయంతో ఒక మంచిరోజున వెంకటరావు గారు ఇల్లు వదిలారు. అప్పుడు వారు తమతో భగవద్గీతనూ, అష్టావక్ర గీతనూ, బైబిల్‌నూ మాత్రం తీసుకువెళ్ళారు. అనేక గ్రామాల గుండా వీరు మైళ్ళకొలది దూరం నడుస్తూ వెళ్ళారు. దారి పొడవునా గ్రామవాసులు ఆయనకు ఆతిథ్యం ఇచ్చారు. అనుకోకుండా అందరికి ఆశ్చర్యం కలిగే విధంగా కొంతమంది బంధువులు ఆయన్ను ఇంటికి పంపారు. ఈ సంఘటన అతన్ని నిరుత్సాహపరచలేదు. దగ్గరున్న కొండలు

## మనదేశంలోని వికలాంగులు

*జాతీయ శాంపుల్స్ సర్వేవారు 1991వ సంవత్సరంలో జరిపిన సర్వే ప్రకారం మనదేశంలో 14.56 మిలియన్ల వికలాంగులు ఉన్నట్లు తెలిసి వచ్చింది. అంటే మనదేశంలోని 1.9 శాతం జనాభా ఏదో ఒక అంగవైకల్యంతో బాధపడు తున్నారు. దేశం జనాభాలోని 2.5 శాతం వ్యక్తులు మానసిక ఎదుగుదల లేకుండా ఉన్నారని కూడా ఈ సర్వేవల్ల తెలిసింది.*

"తన సిద్ధాంతాలపైన ఒంటరిగా నిలబడ్డవాడే అతి బలవంతుడు."
— హెన్రిక్ ఇబ్సెన్

అప్పటినుండీ వీరిని ఆకర్షించసాగాయి. కొండలపై ఏకాంత ప్రదేశంలో కూర్చొని జపం చేస్తూ ఓంకారాన్ని ఉచ్చరిస్తూ సమాధిలోకి వెళ్ళిపోయేవారు. ఆయన ఆధ్యాత్మిక ఆసక్తిని తెలుసుకున్న అతని స్నేహితులు, తలిదండ్రులు అతన్ని హర్ ద్వార్‌కు పంపారు. ఈసారి వారు తమతో ఇతర ధార్మిక గ్రంథాలతోపాటు తమని బాగా ప్రభావితం చేసిన శ్రీరామ తీర్థుల వారి గ్రంథాలను కూడా తీసుక వెళ్ళారు. స్వర్గాశ్రమం చేరి ఓంకారాన్ని జపిస్తూ వీరు ఆరు సంవత్సరాలు ఘోర తపస్సు చేసారు. అక్కడున్న సాధువు లందరూ మొదట్లో ఇతని 'ఓం స్వామీ' అని పిలిచేవారు. తరువాత అతన్ని ఓంకార స్వామి అని పిలువసాగారు. కాల క్రమేణ వారి పేరు ఓంకార స్వామిగా చెలామణి అయింది.

అసలైన గురువు భగవంతుడు అనే ఆత్మజ్యోతి అని అతని అంతరాత్మ బోధించింది. ఒక మంచి రోజున ఆయన సన్యాసాన్ని తనకుతానే స్వీకరించారు.

నామరూప రహితుడైన భగవంతుడు స్వామి ఓంకార్‌గారి జీవితంలో కొన్ని అద్భుతాలను చేయసాగారు. చాలా అరుదైన అనుభవాల్ని వారు పొందారు. ఆనంద సమాధిలో లీనమై ఉన్న ఒకరోజు ఆయనకు విశ్వజనీనమైన ప్రార్థన స్ఫురించింది. అది ప్రపంచానికి ఒక గొప్ప వరంగా మారింది.

ఒకసారి వారు బద్రీనాథ్‌ను దర్శించారు. ఆలయ పూజారి నంబూద్రి వీరిని గర్భ గృహంలోకి ఆహ్వానించాడు. అక్కడ నారాయణ జపం చేస్తూ మూడురోజులు గడిపారు.

కొంతకాలమైన తరువాత వీరు తమ

## విస్డమ్ పాతకాపీలు

*మే '84, జూన్ '84, సెప్టెంబరు '84 నుంచీ నవంబరు '84; మార్చి '85 నుంచీ జూన్ '85; ఫిబ్రవరి '86 నుంచీ ఏప్రిల్ '86, అక్టోబరు '86, డిసెంబరు '86, జనవరి '87, మార్చి '87 నుంచీ మే '87, డిసెంబరు '87, జనవరి '88, మార్చి '88 నుంచీ డిసెంబరు '88; జనవరి '89 నుంచీ డిసెంబరు '89, జనవరి '90 నుంచీ జూన్ '90, ఆగస్టు '90, సెప్టెంబరు '90, నవంబరు '90, డిసెంబరు '90; ఫిబ్రవరి '91 నుంచీ జూలై '91, సెప్టెంబరు '91 నుంచీ డిసెంబరు '91; జనవరి '92 నుంచీ డిసెంబరు '92; జనవరి '93 నుంచీ డిసెంబరు '93; జనవరి '94 నుంచీ డిసెంబరు '94, జనవరి '95 నుంచీ జూన్ '95 కాపీలు మా వద్ద ఉన్నవి. 1984 కాపీల వెల రూ. 6.50 లు; 1985 కాపీల వెల రూ. 5.50 లు; 1986 కాపీల వెల రూ. 7.50 లు; 1987 కాపీల వెల రూ. 8.50 లు; 1988 కాపీల వెల రూ. 18.50 లు; 1989 కాపీల వెల రూ. 24.50 లు; 1990 కాపీల వెల రూ. 23.00లు; 1991 కాపీల వెల రూ. 24.00 లు; 1992 కాపీల వెల రూ. 33.00 లు; 1993 కాపీల వెల రూ. 33.00 లు; 1994 కాపీల వెల రూ. 35.00; 1995 కాపీల వెల రూ. 18.00లు; రిజిస్టర్డ్ పోస్ట్‌లో పొందడానికి కాపీల వెలతో పాటు రూ. 6.00 చేర్చి M.O. పంపాలి. "రత్నా ఏజన్సీస్", 9, దేశికా రోడ్డు (ఆళ్వారుపేటవద్ద) మద్రాసు - 600 004.*

*— సర్క్యులేషన్ మేనేజర్*

"ప్రపంచంలోని మేధావులందరికంటే ఒక సహృదయుడే గొప్పవాడు."

— ఎడ్వర్డ్ బి. లిట్టన్

స్వరాష్ట్రం తిరిగి వచ్చారు. కానీ తరచుగా హిమాలయాల యాత్ర చేస్తూ వచ్చారు. ఒక దాత దానమిచ్చిన చిన్నస్థలంలో ఆంధ్రప్రదేశ్‌లోని అన్నవరం దగ్గరున్న తోటపల్లి కొండల్లో శాంతి ఆశ్రమాన్ని వారు ప్రారంభించారు. దిన దిన ప్రవర్ధమానం చెందుతూ ఆ ఆశ్రమం చాలా మంది సత్యాన్వేషకులకు ఈ రోజుకూ దారి చూపుతోంది.

వీరి జీవితంలో ఒక అసాధారణ సంఘటన జరిగింది. మోకాలిచిప్ప శస్త్రచికిత్స కోసం వారు తమ మోకాలి చిప్పను ఒక బాలికకు దానం చేసారు. శస్త్ర చికిత్స జరుగుతున్నంతసేపు వీరు స్పృహను కోల్పోయే మందును వాడకుండా స్పృహలోనే ఉన్నారు. వాల్తేరు ఆశ్రమ సమీపంలో ఉన్న కైలాస పర్వతంపై స్వామి ఓంకార్ ఆరు సంవత్సరాల కాలం మౌనవ్రతాన్ని పాటించారు.

భక్తుల ఆహ్వానాన్ని స్వీకరించి స్వామి ఓంకార్‌గారు నాలుగుసార్లు ప్రపంచ యాత్ర చేసారు. వారు వెళ్ళిన ప్రతిచోట శాంతి సందేశాన్ని ప్రచారం చేసారు.

శాంతి ఆశ్రమం వారు ఒక గురుకుల పాఠశాలను కూడా నడుపుతున్నారు. 150 మంది పేద విద్యార్థులు ఇందులో చదువుకుంటున్నారు. శాంతి ఆశ్రమంలో వయోవృద్ధుల గృహం కూడా ఉంది. ఇందులో సుమారు 20 మంది వయోవృద్ధులు - ఆడ, మగ పోషింపబడుతున్నారు. చుట్టుపక్కలున్న పేదవారి కోసం అక్కడ 'సుశీల' ఆసుపత్రిని కూడా ఒకటి నిర్వహిస్తున్నారు. నోరులేని జంతువుల సంరక్షణ, చికిత్స కోసం జంతువుల ఆసుపత్రిని కూడా వీరు నెలకొల్పారు. యువకులకు శిక్షణ ఇచ్చేందుకు వేదాంత కాలనీనూ, ఒక శాంతి సంస్థనూ వీరు ప్రారంభించారు. శ్రీరామతీర్థ శాంతి సంస్థను కీర్తిశేషులు జయప్రకాశ్ నారాయణ ప్రారంభించారు.

ఆధ్యాత్మిక స్వానుభవం ద్వారా అబ్బినది కావడంవల్ల స్వామి ఓంకార్ ప్రవచనాలు సరళంగా ఉన్నాయి. 1982వ సంవత్సరం జూన్ నెల 10వ తారీఖున స్వామి ఓంకార్ నిర్యాణం చెందారు. ●

## ఒత్తిడికి గురైనప్పుడు ఏం చెయ్యాలి?

*ఒక పుస్తకం చేతపట్టుకుని చదవడం ప్రారంభించండి
*మీ స్నేహితుడికో లేదా మీ బంధువుకో ఒక జాబురాయడం ప్రారంభించండి
*ఆధ్యాత్మిక లేక సంఘపరమైన సభలకు వెళ్ళండి.
*మీరున్న వాతావరణాన్ని వదలి, బయలు ప్రదేశంలో తాజా గాలిని అనుభవిస్తూ నడవండి.
*తోటపని లేదా వ్యాయామం చేయండి.
*మీకు చింతను కలిగించే అనేక సమస్యలతో మీ మెదడును నింపుకోకండి, ఒక దాని తరువాత మరొక సమస్యను పరిష్కరించుకోండి.
*మీరు చేసిన లేదా చూస్తున్న ప్రయత్నాల ద్వారా మీ సమస్య పరిష్కారం కాని పక్షంలో దేవుడిపై భారం వేయండి

—స్వర్గీయ ఎఫ్.సి.సోంధి

## నీవు గొప్పగా పనిచేయువు!

యజమాని: "చూడు రంజిత్ నీవు గొప్పగా ఆలోచించలేవనికాదు, నీవు గొప్పగా పనిచేయువు!"

"నిదానంగా చేయవలసిన పనిని తొందరగా చేసే వ్యక్తి తొందరగా చేయవలసిన పనిని నిదానంగా చేసే వ్యక్తి - ఇద్దరూ బాధలకు గురౌతారు."

— తిరువళ్ళువర్

అంగారక గ్రహం ఆకాశంలో ఎర్ర రంగుతో వెలుగుతున్న దీపంలా ప్రకాశిస్తుంది. తమ టెలిస్కోపుల (దూరదర్శిని) ద్వారా ఆ టెలిస్కోపులకు జత చేయబడిన ఇతర పరికరాల ద్వారా అంగారక గ్రహాన్ని ఖగోళ శాస్త్రజ్ఞులు అధ్యయనం చేసి చాలా విషయాలను తెలుసుకున్నారు.




అంగారక గ్రహం సూర్యగ్రహం నుండీ సుమారు 227.9 మిలియన్ కిలో మీటర్ల దూరంలో ఉంది.

ఈ గ్రహం 6794 కి.మీ.ల వ్యాసాన్ని కలిగి ఉంది. ఈ వ్యాసం భూమి వ్యాసంలో సగం కంటే కొంత ఎక్కువగా ఉంటుంది. తన అక్షంపై తిరిగేందుకు ఈ గ్రహానికి సుమారు 24 గంటల, 37 నిమిషాల, 23 సెకండ్ల కాలం పడుతుంది. సూర్యుడి చుట్టూ తిరగడానికి ఈ గ్రహానికి 687 రోజులు పడుతుంది. అంగారక గ్రహంపై ఇద్దరు చంద్రులు ఉన్నారు.

భూమిపై ఉన్న దినం కంటే అంగారక గ్రహంపై ఉన్న దినం కొన్తంత ఎక్కువగా ఉంటుంది. కానీ అంగారక సంవత్సరం భూమిపైని సంవత్సరం కంటే దాదాపు రెండింతలు ఉంటుంది. ఆ కారణంగా ఋతువుల కాలం భూమిపై ఉన్న నాలుగు కాలాలకు రెండింతలు ఉంటుంది.

భూమి తన అక్ష్యంపై ఏ కోణంలో వాలి ఉంటుందో ఇంచుమించు అదే కోణంలో అంగారక గ్రహం కూడా తన అక్ష్యంపై వాలి ఉంటుంది. ఈ కోణం అందాజుగా $23^1/_2$ డిగ్రీలు ఉంటుంది.

## వీరు మన కాలేజీ వారా?

*గోపాల్:* "రమేష్ అది ఎలాగు? సీమా నిన్ను ప్రేమిస్తున్నదని నేను ఖచ్చితంగా చెప్పగలను, నీ ప్రేమ ప్రతిపాదనకు ఆమె ఏమని జవాబు ఇచ్చింది."

*రమేష్:* "నేను ప్రేమ ప్రస్తావన తీసుకురాలేదు. నేను చెప్పడానికి ముందే ఆమె కాళిదాసును, బాణభట్టును, భవభూతి అని పేరున్న మరొకడిని ప్రేమిస్తున్నట్లు చెప్పింది. ముగ్గురు వ్యక్తుల్ని ప్రేమిస్తున్న ఈమె నన్ను ప్రేమించే అవకాశం లేదు. ఇంతకు నాకు తెలియక అడుగుతాను! ఈ ముగ్గురు ఎవరు? వీళ్ళు మన కాలేజీ వారేనా?"

— పార్థ

"మగవాళ్ళు యథార్థాన్ని కాకుండా బయటి రూపాలను చూసి నిర్ణయిస్తారు. మగవాళ్ళందరికి కళ్ళున్నాయి. కానీ లోతుగా చూసే ప్రజ్ఞ కొంతమందికే పరిమితం."

— మాచివెల్లి

భూమిలాగానే అంగారక గ్రహం చివర్లు కూడా కాస్త బల్లపరవుగా ఉంటాయి. ఆకారంలో చిన్నది కావడం వల్ల ఈ గ్రహంపై ఉన్న ఆకర్షణశక్తి భూమిపై ఉన్న ఆకర్షణ శక్తిలో 38 శాతం మాత్రం ఉంటుంది.


MARS

టెలిస్కోపు ద్వారా చూసినప్పుడు ఈ గ్రహం మొత్తం ఎర్రగానో లేదా నారింజ రంగుగానో కనిపిస్తుంది. కానీ అస్తవ్యస్తంగా మధ్యలో తిరిగే వడికట్టు (బెల్ట్) మాత్రం కాస్తంత నల్లగా - నలుపు బూడిదరంగు మిశ్రమంగానో లేదా నీలం, ఆకుపచ్చరంగు మిశ్రమంగానో, చిక్కటి ఆకుపచ్చ ఛాయలున్న రంగుగానో - ఉంటుంది.

చిన్నసైజు టెలిస్కోపు ద్వారా కూడా ధృవాలకు తగిలించబడ్డ టోపీలను చూడవచ్చును.

ఋతువులు మారినప్పుడు కూడా ఎర్ర రంగులో ఏమాత్రం మార్పు కనిపించదు. ఆ కారణంగా చాలామంది ఖగోళ శాస్త్రజ్ఞులు అంగారక గ్రహాన్ని రాళ్ళు రప్పలతో, ఇసుక దిబ్బలతో కూడుకున్న ఎడారిగా భావిస్తున్నారు

భూమి వాతావరణంలో కనపడే నీటి ఆవిరి కంటే అంగారక గ్రహం వాతావరణంలోని నీటి ఆవిరి 5 శాతం తక్కువుగా ఉన్నట్లు ఇటీవల జరిగిన అధ్యయనాల ద్వారా తెలిసి వచ్చింది

అంగారక వాతావరణంలో ప్రాణ వాయువు

## అతి ఎక్కువ జనాభా కలిగిన ఐరోపా ఖండంలోని దేశం

*ఐరోపాఖండంలోని జర్మనీదేశం ఆ ఖండంలో అతి ఎక్కువ జనాభాగల దేశంగా పరిగణింపబడుతుంది ఈ దేశం మొత్తం జనాభా 81 మిలియన్లకు పైగా ఉంది ఐరోపాఖండంలోని బ్రిటన్ జనాభా 57.9 మిలియన్లు. 57.4 మిలియన్ల జనాభాగల ఫ్రాన్స్‌దేశం స్థానం ఆ తరువాత వస్తుంది.*

*—(ఫెడరల్ స్టాటిస్టిక్స్ కార్యాలయం)*

## అభిప్రాయం

మీ విస్డమ్ పత్రికను చదివాను మీ పత్రిక విజ్ఞానదాయకంగా ఉంటూ కొత్త విషయాలను తెలియజేస్తున్నది

*—డా॥రాజేంద్రకుమారి బాజ్‌పాయ్*
*లెఫ్టినెంట్ గవర్నర్, రాజ్‌నివాస్*
*పాండిచేరి - 605 001*

"తమ హక్కుల కోసం తీవ్రంగా పోరాడేవారు తమ కర్తవ్య నిర్వహణలో దారుణంగా విఫలులవుతుంటారు." —. లాండర్

భూమిపై ఉన్న ప్రాణ వాయువుకంటే కూడా తక్కువగా ఉంది. ఇది భూమిపై ఉన్న ఒక శాతం ప్రాణవాయువులో 1/10 వంతు భాగం కన్న తక్కువ.

భూమి వాతావరణంలోని బొగ్గుపులుసు వాయువు కంటే రెండు రెట్లు బొగ్గుపులుసు వాయువు అంగారక గ్రహం వాతావరణంలో ఉన్నట్లుగా భావిస్తున్నారు.

టెలిస్కోపుకు థర్మోకపుల్ (Thermocouple) గా పిలువడే ఎలక్ట్రికల్ థర్మామీటర్‌ను జతపరచి అంగారక గ్రహంపై ఉన్న ఉష్ణోగ్రతను ఒక ఉష్ణమాని (Thermometer) ద్వారా కొలవడం జరిగింది.

ఉష్ణమానితో జరిపిన అధ్యయనాల వల్ల అంగారక గ్రహం పచ్చని ప్రాంతాలలో ఎండాకాలం మధ్యాహ్నం పూట ఎండవేడిమి 86 డిగ్రీల ఫారన్‌హీట్ దాకా - ఉంటుందని తెలిసింది. కానీ అంగారక గ్రహం పైనున్న గాలి చాలా పలుచగా ఉండడం వల్ల రాత్రిళ్ళు ఉష్ణోగ్రత చాలా త్వరగా పడిపోవడం జరుగుతోంది. సూర్యాస్తమయ సమయానికి అంగారకుడిపై ఉష్ణోగ్రత 9 డిగ్రీల ఫారన్‌హీట్‌కు పడిపోతుంది. అర్ధ రాత్రివేళలో ఈ ఉష్ణోగ్రత మైనస్ 150 డిగ్రీల ఫారన్‌హీట్‌కు పడిపోతుంది. ఈ ఉష్ణోగ్రత ప్రాణికోటి జీవించడానికి పనికిరాదు, ఇది సహింపరాని చలి. తెలివిగల జీవులు ఈ గ్రహంపై ఎప్పుడైనా నివసించారా అన్నదే అంతు తెలియని పెద్ద ప్రశ్న. ప్రాణులు జీవించి ఉంటే వారు ఎలా జీవించగలిగారు లేదా జీవిస్తున్నారు!

చోదకులు లేని అంతరిక్ష నౌక వైకింగ్ (Viking) జీవరాశిని అంగారక గ్రహంపై కనుగొనలేకపోయింది. ఎర్రని అంగారక గ్రహంపై చోదకుడున్న అంతరిక్ష నౌక దిగేంతవరకు వేచి ఉండాల్సి ఉంది. అప్పుడు నిజం తెలుస్తుంది. ●

## సాధారణ శబ్దం స్థాయి డెసిబుల్




| శబ్దం | డెసిబుల్ (శబ్దంను కొలిచే ప్రమాణం) |
|---|---|
| రాకెట్ లాంచింగ్ పాడ్ | 180 |
| జెట్ విమానం | 140 |
| మోటారు వాహనాల హార్న్ | 120 |
| చెక్కసామాన్లు తయారుచేసే స్థలం | 100 |
| సరాసరి కార్ఖానా | 80-90 |
| గోలతో నిండిన హోటల్ | 80 |
| వాహనాల రద్దీ | 75 |
| సంభాషణలు | 66 |
| సరాసరి గృహం | 50 |
| సద్దులేని కార్యాలయం | 40 |
| గుసగుసలు | 30 |

"తన తండ్రి చెప్పిందే సరైనదని తెలుసుకునేంతలో అతని కొడుకు తన తండ్రి చేస్తున్నది సరైనది కాదనుకుంటాడు"

— చార్లెస్ వర్డ్స్‌వర్త్

# అవీ - ఇవీ

## తేయాకు నుండి బి విటమిన్

మన శరీరానికి కావలసిన 25 శాతం ఫోలిక్ ఆసిడ్‌ను ఆవిరిపై ఎండబెట్టిన తేయాకు (గ్రీన్ టీ) ద్వారా తయారు చేయబడిన 5 కప్పుల తేనీరు సేవనం ద్వారా పొంది పాండురోగాన్ని సులభంగా అరికట్టవచ్చునని కాలిఫోర్నియా నార్త్ బ్రిడ్జ్‌లోని కాలిఫోర్నియా రాష్ట్ర విశ్వ విద్యాలయంకు చెందిన ఆహార విజ్ఞాన పరిశోధకులు తెలియజేస్తున్నారు.

— 'న్యూ సైంటిస్ట్' సౌజన్యంతో

## ప్రపంచానికి కావల్సిన 90 శాతం బియ్యాన్ని పండిస్తున్న ఆశియా ఖండం




బియ్యానికి పుట్టినిల్లుగా పరిగణింపబడుతున్న ఆశియా ఖండంలో మొత్తం ప్రపంచంలో పండుతున్న 500 మిలియన్ టన్నుల ఓయ్యంలో 90 శాతం బియ్యం పండుతోంది. ఆశియా ఖండానికి చెందిన 70 శాతం జనాబా (సుమారుగా 3 000 మిలియన్ల జనం) పూర్తిగా లేదా కొంత వరకు ఓయ్యంపైనే ఆధారపడి ఉంది.

## అతి త్వరగా గుర్తు పెట్టుకునే అతి చిన్నదైన 'చిప్'

ప్రపంచంలో అతి త్వరగా గుర్తు పెట్టుకునే అతి చిన్నదైన 256 మెగాబిట్ మెమరీ చిప్‌ను అమెరికా, జర్మనీ, జపాను దేశాలకు చెందిన ఎలక్ట్రానిక్ వస్తువులను తయారు చేసే బృందం అభివృద్ధి పరిచింది. డబుల్ స్పేస్‌లో టైపు చేయబడిన 25,000 పేజీల పుస్తకంను ఈ చిప్‌లో భద్ర పరచవచ్చు. ఇప్పుడు ప్రస్తుతం ఉన్న చిప్ సైజులో ఇది 13 శాతం చిన్నదిగా ఉంటుంది. అయినా దీని ప్రవేశ సౌలభ్యం (access) కాలం ఇలాంటి సాధారణ చిప్స్ కంటే రెండింతలు ఉంటుంది.

## గంటకు 300 కి.మీ.ల వేగంతో ఎగురగల బైరిపక్షి

*బైరిపక్షి (Falcon) ఎగురుతూ తన ఎరను వేటాడి పట్టుకోగల అరుదైన పక్షి. ఎత్తునుంచి క్రిందికి దూసుకు వస్తున్నప్పుడు ఈ పక్షి వేగం గంటకు 300కి.మీ.లకు చేరగలదు. ఈ వేగం జపానులోని బుల్లెట్ ట్రైన్ వేగానికి సమంగా ఉంటుంది.*

"అతి సులభమైన చట్టాన్ని పాటించడం, అతి కఠినమైన చట్టాన్ని అమలుపరచడం అరుదుగా జరుగుతుంది." — బెంజమిన్ ఫ్రాంక్లిన్

## మడత పెట్టగల స్కూటర్

సంచిలో మడతపెట్టి ఉంచి రైలులోనో, బస్సులోనో తీసుకుపోగల కొత్తరకం స్కూటర్‌ను నల్ల సముద్రం - యుక్రైన్‌కు చెందిన క్రిమియా ( Crimea)లోని సిమ్‌ఫెరోపోల్ (Simferopol) నివాసి వ్లాడిమిర్ అబ్రామోవ్ తయారుచేసాడు. 26 కేజీల బరువు గల ఈ స్కూటర్ కనీసం గంటకు 40 కి.మీ.ల వేగంతో పోగలదు. ఈ స్కూటరు అమర్చడానికి, లేదా విప్పడానికి ఒక నిమిషం మాత్రమే పడుతుంది.

## ప్రతి సంవత్సరం కురచబడుతున్న సూర్యుడు




అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని నేషనల్ సెంటర్ ఫర్ అట్‌మాస్ఫెరిక్ రిసెర్చి సంస్థలో పనిచేస్తున్న భౌతిక శాస్త్రవేత్తల ప్రకారం సూర్యుడు ప్రతి సంవత్సరం కొంచెం కొంచెంగా కురచబడుతున్నాడు. ప్రత్యేకమైన టెలిస్కోపు ద్వారా సూర్యుడి ఉపరితలాన్ని కొలచిన ఈ శాస్త్రజ్ఞులు సూర్యుడు ఒక సంవత్సరంలో 6 మొదలు 8 కి.మీ.ల దాకా కురచబడుతున్నాడని తెలుసుకున్నారు. కానీ 1,392,000 కి.మీ.లు సూర్యుడి వ్యాసంలో 6 నుంచి 8 కి.మీ.లు కురచబడడం లెక్కలోకి రాదు.

## ఆ కోవకు చెందిన మొదటి ప్లాంట్

ఒక మిలియన్ టన్నుల సిమెంట్‌ను ఉత్పత్తి చేయగల తండూర్ (ఆం.ప్ర.). సిమెంట్ ప్లాంట్ ఆ కోవకు చెందిన మొట్టమొదటి సిమెంట్ ప్లాంట్. ఇంధనం ఉపయోగంలో విద్యుచ్ఛక్తి వాడకంలో పొదుపును పాటించే సాధనాలు ఈ ప్లాంటులో ఇమిడి ఉన్నాయి. ఆ కారణంగా ఈ ప్లాంట్‌ను సులభంగా నడువవచ్చును. ఉత్పత్తి అవుతున్న సిమెంట్ నాణ్యతను కూడా అదుపులో ఉంచగలుగుతుంది.

## నేను కాదండి

పాఠశాలలను తనిఖీ చేసే అధికారి ఒకసారి ఒక ప్రాథమిక పాఠశాలలో ప్రవేశించాడు. 6వ తరగతి విద్యార్థులను ఉద్దేశించి 'మీరు రామాయణం చదివారు కదా! మరైతే శివుడి ధనుస్సును ఎవరు విరిచారో చెప్పగలరా?' అని ప్రశ్నించాడు. అందరూ మౌనం వహించారు. ఒకే ఒక విద్యార్థి చేయి పైకెత్తి: "అయ్యా శివుడి ధనస్సును ఎవరు విరిచారో నేను చెప్పలేను. కానీ, ఆవిరిచింది నేను మాత్రం కాదు," అని జవాబిచ్చాడు.

"చట్టంతో వచ్చిన చిక్కేమిటంటే అందరూ చట్టాన్ని అమలు పరచాలని అంటారేగానీ దాన్ని పాటించాలని ఆలోచించరు."

— థామస్ జఫర్‌సన్

## పరుగిడుతున్న వ్యక్తి నాడి పరీక్ష

బయో రేడియో రిమోట్ కంట్రోల్ సిస్టమ్ (BRATS) ద్వారా పరుగిడుతున్న వ్యక్తి నాడీని పరీక్షించడం ఇప్పుడు కుదురుతుందని రష్యా దేశపు ఫిజీషియన్లు అంటున్నారు. ఈ పద్ధతి ఊపిరి పీల్చుకునే వివరాలనూ, హృదయపు సిస్టోల్ (గుండె సంకోచించేందుకు పట్టేకాలం) వివరాలనూ, శరీర ఉష్ణోగ్రత వివరాలను గ్రహించి ఒక చిన్న గ్రహణ యంత్రానికి అది అందజేస్తుంది.

## రోగులకు సేవ చేసే రోబోట్స్

'స్టీల్ కాలర్స్' (Steel Collars)గా పిలువబడే రోబోట్స్ ఎక్కువ సంఖ్యలో జపానుకు రానున్నాయి రోబోటినిక్స్ (Robotinics) అభివృద్ధి అనుకున్న ప్రకారం జరిగినప్పుడు జపానులో ముందు ముందు రోగులకు సేవచేసే రోబోట్స్, వీధులను శుభ్రం చేసే రోబోట్స్, గుడ్డివారికి దారి చూపే రోబోట్స్, చేపలను పట్టే పడవలలో నావికులుగా పనిచేసే రోబోట్స్ త్వరలో రానున్నాయి.

## వాత రోగం నివారణకు ఆయుర్వేదం మందు

భారతదేశంలోని జమ్మూ కాశ్మీర్ రాష్ట్రానికి చెందిన జమ్ము ప్రాంతీయ పరిశోధక సంస్థవారు వాతరోగం నివారణకు ఆయుర్వేద మందు గుగ్గల్ (Guggal)ను అభివృద్ధి పరిచారు. వైద్య శిక్షణా పరీక్షల వల్ల ఈ మందును వాడిన రోగులకు వాతనొప్పులు తగ్గడంకాని పూర్తిగా నొప్పి మటుమాయం అవడం కాని జరిగిందని తేలింది.

●

## సవాలు

Take the Challenge



చీకటిలో ఉన్నపుడు
సవాలు నా పాలిటి ఆశాదీపం
నాకు విరక్తి కలిగినపుడు
సవాలు నాకు అవుతుంది నేస్తం.
బ్రతుకులో ఆశ పోయినప్పుడు
సవాలు ఇస్తుంది ఉచ్ఛ్వాసం.
జీవితంలో ఎదగాలన్నప్పుడు
సవాలు అవుతుందొక ఆధారం.
ఓ యువతా!
జీవితపు సవాలును సవాలు చేయి
విచక్షణకు బలైన వారిని ప్రేమించు.
చదువులేని వారిని విద్యావంతులను చేయి
దారి తెలియని యువతకు దారి చూపు
నీ జీవితాన్ని సుఖంగా నీవు జీవించు.
ఇదొక సవాలు.

— ఎ. జరోమ్
('ఇన్స్పిరేషనల్ కోట్')

"ఒక హద్దును దాటిన సహనం సుగుణం అనిపించుకోదు."

— అరవిందో

# సుభాషితాలు

తాత్పర్య రచన: యామిజాల పద్మనాభస్వామి

పండితులైనవారు దిగువం దగనుండగ
అల్పుడొక్కడు
ద్దండత పీఠమెక్కిన బుధ ప్రకరంబున కేమి
యొగ్గగున్?
కొండొక కోతి చెట్టుకొన కొమ్మల నుండగ
క్రింద గండ బే
రుండ మదేభ సింహ నికురుంబము
లుండవే? చేరి; భాస్కరా!

[బాగా చదివిన విద్వాంసులు క్రింద కూర్చుండగా చదువు సరిగా లేని సామాన్యుడు అక్కడ ఉన్న ఆసనము మీద కూర్చున్నంత మాత్రాన ఆ విద్వాంసులకు ఏమీ లోపం లేదు, రాదు. కోతి చెట్టు కొమ్మపై ఉండి ఆకులూ, రేకులూ జల్లుతూ ఉంటుంది. కింద పెద్ద గండబేరుండ పక్షులు, ఏనుగులూ, సింహాలూ ఉంటాయి వాటికి వచ్చిన కొరత లేదు]

* * *

పలుచని హీన మానవుడు పాటి తలంపక
నిష్ఠు రోక్తులం
బలుకుచునుండుగాని మతి బాసురుడైన
గుణ ప్రపూర్ణుడ
ప్పలుకులు పల్కబోవడు నిబద్ధిగ ఎట్లన;
వెల్తికుండతా
తొలకుచునుండుగాని మరి తొల్కునె
నిండు ఘటంబు? భాస్కరా!

[అల్పబుద్ధి గలవాడు మన్ననలేక నోటికి వచ్చినట్లు వాగుతాడుగాని బుద్ధిమంతుడై గుణవంతుడులాగ కరకుగా మాటలాడడు. వెల్తిగా ఉన్న కుండనీళ్ళు తొలుకుతూ ఉంటుంది గాని నిండుగా నీరున్న కుండ తొలకదు కదా!] ●

## భారతదేశపు తొలి తపాలా బిళ్ళ



Scinde Dawk First Indian Stamp

*స్కిండే డాక్ (Scinde Dawk) - సింధు ప్రాంతం - అన్న పేరుతో తొలి తపాలా బిళ్ళ మనదేశంలో 1852వ సంవత్సరం జూలై నెల 1 వ తారీఖున జారీ చేయబడింది. మొత్తం దేశంకు ఉపయోగపడే అర్ధణా, అణా స్టాంపులను 1854 వ సంవత్సరం అక్టోబర్ నెల మొదటి తేదీన జారీ చేసారు. అదే సంవత్సరపు అదే నెల 15 వ తారీఖున నాలుగణాల తపాలా బిళ్ళను తొలిసారిగా విడుదల చేసారు*

"మోటుతనం ఒక బలహీనుని బలం హద్దును సూచిస్తుంది."
— ఎరిక్ హోఫర్

# సామాన్యునికి న్యాయశాస్త్రం

## ఆడపిల్లల్ని వేధించడం

చేతన్ వ్యాస్

ఇండియన్ పీనల్ కోడ్‌లో 509వ సెక్షన్ ప్రకారం ఆడపిల్లల్ని వేధించడం నేరంగా పరిగణించబడుతోంది ఏయే పనులను వేధించడంగా భావించాలో ఆ సెక్షన్ మనకు వివరిస్తుంది. కానీ, "స్త్రీ లజ్జను అవమానపరచడం" అన్న శీర్షిక ఇవ్వబడడంతో స్త్రీలను వేధించకూడదు అని అర్థం చేసుకోవచ్చును




ఆడపిల్లను ఉద్దేశించి ఒక మాట అనడమో, ఒక అసహజమైన ధ్వనిని చేయడమో, లేదా వెకిలి సంకేతాలు చేయడమో లేదా ఒక వస్తువును ప్రదర్శించడమో చేసి తన మాట, సంకేతం, శబ్దం లేదా ప్రదర్శించే వస్తువుద్వారా ఆడపిల్లల లజ్జను దెబ్బతీసేవిధంగా ప్రవర్తించడాన్ని స్త్రీలను వేధించే విషయాలుగా భావించాలి. స్త్రీ ప్రమేయం లేదా అనుమతి లేకుండా ఆమె ఏకాంతాన్ని భంగపరుస్తూ ఆమె లజ్జను అవమానపరచడం నేరంగా భావించాలి.

దేన్ని స్త్రీ ఏకాంతాన్ని భంగపరచడం అంటారు? తనదైన లేదా తనకోసం కేటాయించబడిన ఏకాంత స్థలంలో ఉంటున్న హిందూ లేదా ముస్లిం స్త్రీ ఉన్న చోటుకు చొచ్చుకరావడాన్ని ఏకాంతాన్ని భంగం చేయడమంటారు. బురఖా స్త్రీల బురఖాను తీసివేయడం అన్నది ముస్లిం స్త్రీ లజ్జను

## ఎలాంటి సంబంధం లేదు

ఒకసారి అమెరికా దేశపు సుప్రసిద్ధ హాస్య రచయితా నవలాకారుడైన మార్క్‌ట్వైన్ ఇంగ్లాండుకు రావడం తటస్థించింది. ఆ రోజే బంగారును తీసుకు వెళుతున్న ఒక రైలు బండి దోపిడికి గురి అయింది. ఆరోజు జరిగిన సంఘటనలకు ప్రాధాన్యత ఇస్తూ వార్తా పత్రికలు పోస్టర్లను తయారుచేసారు. మొదటి వార్తగా "మార్క్‌ట్వైన్ వచ్చారు అని ప్రచురిస్తూ దాని కిందే బంగారును తీసుకువెళుతున్న రైల్ దోపిడి జరిగింది" అన్న వార్తను కూడా ప్రచురించారు. ఈ పతాక శీర్షికలను చూసిన మార్క్‌ట్వైన్ "ఈ రెండు సంఘటనలకు ఎలాంటి సంబంధం లేదని మీకు నేను హామీ ఇస్తున్నాను" అని చమత్కరించాడు.

"ఆసక్తితో పుస్తకం చదవాలనుకున్న వ్యక్తికీ, అలసటతో పుస్తకం చదవాలనుకున్న వ్యక్తికీ ఎంతో భేదం ఉంది." — జి.కె. చస్టర్‌టన్

అవమానపరచడం శుభాకాంక్షలను తెలుపుతూ స్త్రీ బుగ్గలను బహిరంగ స్థలాలలో ముద్దు పెట్టుకోవడం పాశ్చాత్యదేశాలలో సర్వసాధారణంగా జరుగుతుంది. అలా మన దేశంలో చేసినప్పుడు చాలా మంది ముక్కుపై వేలువేసుకుంటారు. ఇలాంటి ఒక కేసు మనదేశంలో నమోదయింది. ప్రేమానంద్ అనే ఒక వ్యక్తి ఒకసారి నలుగురు స్త్రీలు నిదురపోతున్న ఒక గదిలో ప్రవేశించాడు. వచ్చిన వాడిని చూచి ఆ స్త్రీలు కేకలు వేయడంతో అతడు పారిపోయాడు. ఆ తరువాత ఆ వ్యక్తి పట్టుబడ్డాడు. ఆ వ్యక్తిని సెక్షన్ 509 ప్రకారం శిక్షించడం జరిగింది.

మరో కేసులో ఫిర్యాదుదారుడి కూతురు వెంటబడి, నవ్వుతూ పేరుపెట్టి పిలిచినందుకు మహమ్మద్ ఛిస్టీకు సెక్షన్ 509 ప్రకారం శిక్ష ఇవ్వబడింది.

ఇంకొక కేసులో ఒకసారి తారక్‌గుప్త ఒక ఇంగ్లీష్ నర్స్‌పేరిట అసహ్యామైన మాటలతో కూడుకున్న ఒక జాబురాసాడు. నర్సుఫిర్యాదు చేయగా తారక్ గుప్త జాబు ఉద్దేశం ఆమె లజ్జను అవమానపరచడంగా నిరూపించబడింది. దాంతో అతడ్ని దోషిగా పరిగణించి 509 సెక్షన్ ప్రకారం దండించడం జరిగింది.

ఇక్కడ ఒక ముఖ్య విషయం గుర్తుంచుకోవాలి. వేధించబడుతున్న స్త్రీ వయసుతో ఈ చట్టానికి ఎలాంటి ప్రమేయం లేదు.

—'పార్థ' సౌజన్యంతో

## ధనం గర్వకారణం కారాదు



ధనం కారణంగా గర్వాన్ని పొందరాదు. నేనే ధనవంతుడినని మీరనుకుంటే మీకంటే ఎక్కువ ధనవంతులయిన వారి ఉదాహరణను ఇతరులు మీముందుంచుతారు. సాయంకాలం వేళ మిణుగురు పురుగులు బయటికొచ్చి నేనే ప్రపంచాన్ని వెలుగుతో నింపుతున్నానని భావిస్తుంది. కానీ నక్షత్రాలు ఆకాశంలోకి రావడంతో మిణుగురు పురుగు గర్వం పటాపంచలవుతుంది. మెరిసే తారలు ప్రపంచానికి మేమే వెలుగునిస్తున్నామని అనుకుంటాయి. కానీ చంద్రోదయం తరువాత తారల వెలుగు మందగిస్తుంది. ఆకాశంలో పుట్టిన చంద్రుడు తనవల్లే ప్రపంచం సంతోషంగా ఉందని మొత్తం భూమిని తానే వెలుగుతో నింపుతున్నానను కుంటాడు ఆ తరువాత తూర్పు ప్రాంతం ఎర్రబారుతుంది. సూర్యుడు ఉదయిస్తాడు. సూర్యోదయాన్ని చూసి చంద్రుడు ఉన్న చోటు తెలియకుండా పోతాడు.

— శ్రీరామకృష్ణుడు

"హాగస్తులకు హాంగిపోరు విమర్శలకు క్రుంగిపోకు." — రోజ్‌పాల్

# జీవితం చాలా విలువైనది

జీవితం చాలా విలువైనది. మీ చేతులనుండీ జారవిడుచుకోకండి.
ప్రతిరోజు, ప్రతిఘడియా చేసినది కాదు చేయడానికి ఇంకా ఎంతో ఉంది.
వ్యర్థం చేసిన ప్రతిక్షణం చేయిజారిపోయిన బంగారు అవకాశం
తలక్రిందులైనాసరే గడిచిపోయిన కాలాన్ని పొందలేము
చూడని కన్నులెందుకు? వినలేని చెవులు ఎందుకు?
సహాయం చేయలేని చేతులెందుకు? ఇతరులను సంతోషపెట్టని హృదయమెందుకు?
ఇవి ఉపయోగకరమైన ఆస్తులు. వీటి వెనుక గొప్ప ఉద్దేశం దాగుంది.
వాటికి నెరవేర్చవలసిన బాధ్యత ఉంది. ప్రతి ప్రార్థనకు బదులు చెప్పవలసి ఉంది.
ప్రేమించే హృదయం అవసరం ఎంతైనా ఉంది.
ప్రేమకు సాధ్యం కానిది, జయించలేనిదంటూ ఈ భూమిపై ఏదీలేదు
ఆపదలలో ఉన్న వాడిని ఆదుకోవడానికి సమయం లేదని ఎందుకు నటించాలి?
సహాయపడేందుకు అనువైన ఘడియల్ని ఎందుకు అలక్ష్యం చేస్తున్నావు?
ప్రతిమనిషి, తన ధర్మాన్ని ఎల్లప్పుడూ పాటిస్తూనే ఉండాలి.
అలా చేసినప్పుడే మానవాళిలో తానూ ఒక భాగం అయ్యే హక్కును పొందుతాడు.
కానీ తన కర్తవ్యాన్ని తెలుసుకునేంతలో ఇహలోకయాత్ర చాలించే కాలం వస్తుంది.
మరి ఈ దేహం పోయిన తరువాత మీదని చూపించడానికి మీవద్ద ఏముంటుంది?
సంపదకాదు, హోదా కాదు, పేరుప్రతిష్ఠలు అసలేకాదు. మీరు చేసిన మంచి పనులంటూ ఉంటే అవే మిగులుతాయి.
అవే కలకాలం నిలిచిపోతాయి. అప్పుడే ప్రతి హృదయంలోనూ చెరగని స్థానం లభిస్తుంది.

—జానకి భట్టాచార్య
(రోటరీ న్యూస్ సౌజన్యంతో)

## సురక్షితమైన ఆహారానికి పదిసూత్రాలు

* భద్రత కోసం తయారుచేయబడిన ఆహారాన్ని ఎన్నుకోండి.
* ఆహారాన్ని బాగా వండండి.
* వండిన ఆహారాన్ని వెంటనే తినండి.
* వంటకాల్ని జాగ్రత్తగా భద్రపరచండి.
* వండిన ఆహారాన్ని వాడే ముందు మళ్ళీ వేడి చేయండి.
* వండిన పదార్థాలను వండని పదార్థాలతో కలపకండి.
* చేతులను ఒకటికి రెండుసార్లు బాగా కడుక్కోండి.
* వంటగదిని జాగ్రత్త తీసుకుని శుభ్రంగా ఉంచండి.
* ఆహారాన్ని క్రిములనుండీ, ఎలుకల నుండీ, ఇతర జంతువులనుండీ కాపాడండి.
* ఎప్పుడూ శుభ్రమైన మంచినీరునే వాడండి.

—హెల్త్

"అజ్ఞానాన్ని దాచుకోవడం దాన్ని పెంచుకోవడం అవుతుంది."
— గాంధీజీ

# వార్తలు

## ఆశియా ఖండపు తొలి చక్కెర ఫాక్టరీ

మనదేశపు తూర్పు తీర ప్రాంతం ఒరిస్సాలోని గంజాం (Ganjam) వద్ద 1824 వ సంవత్సరంలో ఆశియా ఖండపు తొలి చక్కెర ఫాక్టరీ స్థాపన జరిగింది.

## అరటిపండ్ల తలసరి వాడకం




మనదేశంలో ప్రస్తుతం అరటిపండ్ల తలసరి సాలీనా వాడకం 9 కేజీలుగా ఉన్నది.

## అతి పేద రాష్ట్రం

మనదేశంలోని ఒరిస్సా రాష్ట్రం మన దేశపు అతి పేద రాష్ట్రంగా పరిగణింప బడుతోంది. ఈ రాష్ట్ర జనాభాలోని 44.11 శాతం ప్రజలు పట్టణ ప్రాంతాలలో నివసిస్తున్నారు. గ్రామ సీమలలో నివసిస్తున్న పేద ప్రజల జనాభా శాతం 57.64 గా ఉన్నది (స్టేట్ ఎకనామిక్ సర్వేరిపోర్ట్ 1994-95)

## చలువరాయి లాంటి కృత్రిమ చలువరాయి

'డెకొరైట్' (Decorite) అన్న పేరుతో రష్యాలో కృత్రిమ చలువరాయిని తయారు చేసారు. మన్నిక, రంగుల దృష్ట్యా ఈ కృత్రిమ చలువరాయి అసలు చలువ రాయిలాగానే ఉంటుంది. సహజమైన రంగులతో సరితూగే రంగులు గల కృత్రిమ చలువరాయిని ప్రస్తుతం తయారు చేయవచ్చును.

## అతి ఎక్కువ సంఖ్యలో దంత వైద్యులున్న దేశం

ప్రపంచంలో మరెక్కడా లేనంతమంది దంతవైద్యులు ఒక్క అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఉన్నారు. అమెరికన్ డెంటల్ అసోసియేషన్‌లో 150,000 సంఖ్యకు మించిన దంత వైద్యులు తమ పేర్లను నమోదు చేసుకున్నారు.

## 13 శాతం గ్రామాలకే పరిమితమైన టెలిఫోన్లు

*మనదేశంలోని 5,70,000 గ్రామాలలో కేవలం 13 శాతం గ్రామాలలోనే టెలిఫోన్లు ఉన్నాయి.*

— ఎకనామిక్ టైమ్స్

"... వాగుపతాలంటే వారిని గురించి [illegible] ఏదు [illegible] వినే [illegible] ఉన్నది."

— డా॥ హైమ్ గినోట్

## పురుషుల ఆయుః పరిమాణం ఎక్కువ ఉన్న 12 దేశాలు

71 శాతం వరకు పురుషుల ఆయుః పరిమాణం ఎక్కువగా ఉన్న 12 దేశాల పేర్లు వరుసగా ఇలా ఉన్నాయి: జపాన్, ఐస్‌లాండ్, గ్రీస్, స్వీడన్, స్విట్జర్లాండ్, ఇజ్రాయిల్, స్పెయిన్, కెనడా, నెదర్లాండ్స్, ఆస్ట్రేలియా, యునైటెడ్ కింగ్‌డమ్, యుఎస్ఎ.

## ప్రతి నూరు మందికి 45 మంది నగరవాసులు




ఈనాడు ప్రపంచంలో సుమారు 2 బిలియన్ల (2000 మిలియన్ల) మంది నగరాలలో నివసిస్తున్నారు. ఇదివరకే ప్రతి నూరుమందికి 45 మంది నగరాలలో ఉన్నారు.

## పేదవారిలో అతి పేదలు

మొత్తం ప్రపంచంలోని పారిశ్రామిక లేదా వ్యవసాయ రంగాలలో 60 సంవత్సరాలకు మించిన స్త్రీలు పేద వారిలో అతి పేదవారిగా జీవిస్తున్నట్లు లెక్కలు తేల్చి చెబుతున్నాయి.

## 110 మిలియన్ల కోకాకోలా బాటిల్స్

ప్రపంచంలో 130 వివిధ దేశాల్లో ప్రతి రోజు 110 మిలియన్ బాటిల్స్ కోకాకోలాను త్రాగుతున్నారు.

## పేదరికం రేఖకు కింద ఉన్న జనాభా

మన దేశపు సుమారు 30 శాతం జనాభా పేదరికం రేఖకు కింద నివసిస్తున్నారు.

## ప్రతి రోజూ 5500 చొప్పున పెరుగుతున్న పొగాకు వాడకం దారులు

పొగత్రాగడం హానికరం అన్న హెచ్చరిక ప్రచారం ఎంత ముమ్మరంగా సాగుతున్నా మనదేశంలో పొగాకు వాడకం దారుల

## శ్రమించడంలోనే రాజరికం ఉంది

సోమరితనంకు, విలాసాలకు బానిసలవుతున్న తన స్నేహితులను గురించి ఒకసారి అలెగ్జాండర్ విలాసాలకు పాల్పడటమే బానిసత్వం, శ్రమించడంలోనే రాజరికం ఉంది అన్నాడు.

—బారో

"విశాల హృదయం కలవారే నిజమైన స్నేహితులవుతారు. నీచులు, పిరికిపందలు నిజమైన స్నేహాన్ని ఎప్పుడూ తెలుసుకోలేరు."

— చార్లెస్ కింగ్స్లె

సంఖ్య రోజుకు 5,500 చొప్పున పెరుగుతోంది.

## కనుమరుగు కానున్న 77 రకాల స్తన్య జీవులు




ప్రస్తుతం మనదేశంలో 372 రకాల స్తన్యజీవులు ఉన్నాయి. ఇందులోని 77 రకాల జీవులు వాటి నివాస స్థానాలను ఆక్రమించుకోవడం లేదా చంపబడడం వల్ల త్వరలో కనుమరుగు కానున్నాయి కనుమరుగు అవనున్న ఈ రకాలలో అడవినక్క, మంచు ప్రాంతాలలో నివసించే చిరుతపులి (Snow Leopard) బ్లేక్‌బక్, బ్లూషీప్, గ్రేట్ ఇండియన్ బస్టర్డ్ లాంటి స్తన్యజీవులు ఉన్నాయి.

## ముతక ఇనుము నిలువలు ఎక్కువ ఉన్న బ్రెజిల్

ప్రపంచం మొత్తంలో ఎక్కువ ముతక ఇనుము నిలవలు దక్షిణ అమెరికాలోని బ్రెజిల్‌లో ఉన్నాయి. అక్కడ సుమారు 70.000 మిలియన్ టన్నుల ముతక ఇనుము ఉన్నట్లు అంచనా వేయబడింది. ఇది ప్రపంచంలోని ముతక ఇనుము నిలవలో 35 శాతంగా ఉంది.

## సౌరశక్తి గ్రామం

తమకు కావల్సిన మొత్తం విద్యుచ్ఛక్తి అవసరాలను సౌరశక్తి ద్వారా పొందుతున్న ఏకైక గ్రామంను సౌరశక్తి గ్రామంగా గుర్తించారు. ఇప్పటి ఇండోనేషియా (ఇంతకుముందు దీన్ని పడమటి జావా అని పిలిచేవారు) లోని పికోనిన్ (Piconin) గ్రామంలో సౌరశక్తిని తమ అవసరాలన్నింటికీ వాడుతున్నారు. ఇండోనేషియాలోని అనేక నగరాలలోని ఆసుపత్రులలో నీళ్ళను వేడిచేయడానికి సౌరశక్తిని వాడుతున్నారు.

## విశ్వవిద్యాలయాలూ, విద్యా సంస్థలూ తయారుచేస్తున్న 1,15,000 ఇంజనీర్లు

ఏటా మనదేశంలోని 150 విశ్వవిద్యాలయాలూ 460 ఇతర విద్యా సంస్థలూ కలిపి 1,15,000 మంది ఇంజనీరింగ్ పట్టభద్రులను తయారు చేస్తున్నాయి.

## ప్రపంచపు మిక్కిలి ధనవంతులు

ప్రస్తుతం ప్రపంచంలో 388 అత్యధిక ధనవంతులు లేదా కుటుంబాలు ఉన్నాయి.

"ధైర్యంతో పనులను చేపట్టేవారినే జయలక్ష్మి వరిస్తుంది ఫలితం ఎలా ఉంటుందో అని భయపడే పిరికివారిని విజయం వరించదు"

— జవహర్‌లాల్ నెహ్రూ

వీరి కనీసం ఆస్తి ఒక బిలియన్‌కు తగ్గకుండా ఉంటుందని భావిస్తున్నారు. ఈ ధనవంతుల దగ్గర మొత్తం 893 బిలియన్ డాలర్లు ఉన్నట్లు అంచనా వేయబడింది. — ఫోర్బ్స్

## మనదేశపు శిశుమరణాల రేటు



Infant mortality

మనదేశంలో ప్రతి 1000 మంది శిశువులకు 80 మంది శిశువులు మరణిస్తున్నారు. ఈ సంఖ్య చైనాలో ప్రతి 1000 మందికి 35, ఫిలిప్పైన్స్‌లో 45, యుఎస్ఏలో 9.1, బ్రిటన్‌లో 9, స్వీడన్‌లో 5, జపానులో 5 బంగ్లాదేశ్‌లో 119, పాకిస్థాన్‌లో 108 గా ఉన్నది.

## ప్రపంచపు మొత్తంలో అరటిపండ్ల దిగుబడి

ప్రపంచం మొత్తంలో పండుతున్న అరటిపండ్లు ఈనాడు 87 మిలియన్‌ల టన్నులు.

## ప్రపంచంలోని అతి ధనవంతమైన దేశం

1994 వ సంవత్సరంలో జపాను ప్రపంచపు అతి ధనవంతమైన దేశంగ మారింది. ఇతర దేశాలలో ఉన్న ఈ దేశపు ఆస్తుల విలువ 688.9 బిలియన్ డాలర్లని తెలుస్తోంది.

## పొగాకు ఉత్పత్తిలో ఇండియాకు మూడవ స్థానం

ప్రపంచపు పొగాకు ఉత్పత్తిలో మన వంతు వాటా 7.1 శాతమే. అయినా మన దేశం పొగాకు ఉత్పత్తిలో మూడవ స్థానంలో ఉంది. పొగాకు ఉత్పత్తిలో 13.5 శాతం వాటా ఉన్న చైనా మొదటి స్థానంలోనూ 9.9 శాతం వాటా ఉన్న అమెరికా సంయుక్త రాష్ట్రాలు రెండవ స్థానంలోనూ ఉన్నాయి.

## పొగాకు సంబంధించిన వ్యాధుల కారణంగా మరణాలు

మనదేశంలో పొగాకు సంబంధించిన వ్యాధుల కారణంగా సుమారు 10 లక్షల జనం ఏటా మరణిస్తున్నారు.

## గుండె స్థానం

"డాస్ట్రోకార్డియా" (Dastrocardia) కారణంగా ప్రతి పది లక్షల మందిలో ఒకరికి గుండె ఎడమవైపు కాకుండా కుడి వైపు ఉండే అవకాశాలు ఉన్నాయని గుండె వైద్య నిపుణులు అంటున్నారు.

"[illegible] తెలివాడ [illegible] పోషించుకోవటం [illegible] తొందరపడ [illegible]" — గోథే

జాన్ డి 'సౌజా

నీగ్రోల గాంధీగా పిలువబడుతున్న మార్టిన్ లూథర్ కింగ్ 1968వ సంవత్సరం ఏప్రిల్ నెల 4వ తారీఖున దారుణంగా హత్య చేయబడ్డాడు. గాంధీగారి లాగానే మార్టిన్ లూథర్ కింగ్ అహింసను విశ్వసించాడు. ప్రేమ ద్వారానే అన్నింటిని సాధించవచ్చుని అతడు ఎప్పుడూ అనేవాడు.




ఏసు ప్రభువులాగానే మార్టిన్ లూథర్ కింగ్ కూడా 'కత్తిని నమ్మిన వ్యక్తి కత్తికే గురౌతాడు' అని భావించేవాడు. అమెరికా దేశపు నీగ్రోల హక్కుల కోసం ఇతడు చిత్తశుద్ధితో పోరాడాడు.

తమ హక్కుల కోసం పోరాడేందుకు అమెరికాలోని నీగ్రోలు ఒక జాతీయ నాయకుడి కోసం ఎదురుచూసారు. ఒక వర్ణం హింస ద్వారానే హక్కులను పొందడం సంభవం అని భావించేది. కానీ డా॥ మార్టిన్ లూథర్ కింగ్ మాత్రం హింసా మార్గం కూడదన్నాడు. "శాంతియుత మార్గాల ద్వారానే సాధించాలని" వాదించేవాడు.

చిత్తశుద్ధి గల క్రైస్తవ మతపరాయణుడు కావడంవల్ల ఏసు ప్రభువు ఉపదేశాలనూ, క్రైస్తవ మతం తనకు నేర్పిన పాఠాలను మాత్రం ఇతడు అమలుపరిచాడు ఇతడొక మతాధికారి. వీరి తాతగారు, తండ్రి, సోదరుడు, మామయ్య కూడా మతాధికారులే

అల్బామా బస్ బహిష్కరణ (బాయ్‌కాట్) ఉద్యమం ద్వారా ప్రపంచం ఇతన్ని గుర్తించింది. తెల్లవారి కోసం నిర్దేశించబడిన బస్ ముందుభాగంలో రోసా పార్క్స్ (Rosa Parks) అన్న ఒక స్త్రీ కూర్చుంది. బస్ డ్రైవర్ అభ్యంతరం తెలుపుతూ ఆమెను అక్కడి నుండి లేవమన్నాడు. కానీ శ్రీమతి పార్క్స్ నిరాకరించింది. ఆ కారణంగా ఆమెను కోర్టులో హాజరు పరిచారు.

## భారతదేశపు అతి ప్రాచీన దినపత్రిక

ఇప్పటికీ ఇంకా చలామణిలో ఉన్న 'బాంబే సమాచార్' దినపత్రిక మనదేశపు అతి ప్రాచీనమైన దినపత్రిక ఈ పత్రిక స్థాపన 1822వ సంవత్సరంలో జరిగింది.

[illegible] యుద్ధాలకు దారితీస్తుంది కానీ వివేకం [illegible] నిలిచే [illegible] అవుతుంది."

కోర్టు ఆమెకు 10 డాలర్ల జరిమానాను విధించింది. ఈ విషయం విన్న నీగ్రోలకు కోపం వచ్చింది. అల్బామా బస్సులను బహిష్కరించమని డా॥ మార్టిన్ లూథర్ కింగ్ సాటి నీగ్రోలను కోరాడు. వారు అతని పిలుపు విని బస్సులను బహిష్కరించారు. ఈ సమ్మె ఒక సంవత్సరకాలం జరిగింది. సమ్మె కారణంగా బస్ కంపెనీ ఆదాయం బాగా పడిపోయింది. ఆఖరుకు బస్ కంపెనీవారు తెల్లవారికి ప్రత్యేకమైన సీట్లను కేటాయించే పద్ధతికి స్వస్తి చెప్పారు. ఇది నీగ్రోలు సాధించిన అమోఘమైన విజయం. ఆ సంఘటనతో ప్రజలు డా॥ మార్టిన్ లూథర్ కింగ్ శక్తిని తెలుసుకున్నారు.

అప్పుడు ఏర్పడిన బహిష్కరణ కమిటీకు డా॥ మార్టిన్ లూథర్ కింగ్ అధ్యక్షుడిగా ఉండేవాడు. ఆ సంస్థను ఈ రోజు సదరన్ క్రిస్టియన్ లీడర్‌షిప్ కాన్ఫరెన్స్ అన్న పేరుతో పిలుస్తున్నారు.

డా॥ కింగ్ 1929వ సంవత్సరంలో జన్మించాడు. బాలుడుగా ఉన్నప్పుడు డా॥ కింగ్ మోటురకం ఆటలను ఆడేందుకు ఇష్టపడేవాడు. కానీ కింగ్ ఎవరితోనూ పోట్లాడేవాడు కాదు. ఒకసారి, ఆ స్కూలుకు చెందిన ఒక దుష్ట బాలుడు కింగ్‌ను కొట్టి మెట్లపై నుండీ కిందకు తోసాడు. అప్పుడు కూడా కింగ్ తిరగబడి వాడిని కొట్టలేదు.

కింగ్ చదువు సంధ్యలలో చురుగ్గా ఉండేవాడు. 15 సంవత్సరాల వయసులో కింగ్ అట్లాంటాలోని నీగ్రో మోర్‌హవుస్ కాలేజీలో ప్రవేశించాడు. ఆ తరువాత అతడు పెన్సిల్వేనియాలోని క్రోజర్ థియోలోజికల్ సెమినరీలో తన చదువును కొనసాగించాడు. మెస్సచుసెట్స్ (Massa-chusetts)లోని బోస్టన్ విశ్వవిద్యాలయం నుండి క్రైస్తవ ధర్మశాస్త్రంకు సంబంధించిన పిహెచ్.డి. పట్టాను పొందాడు. 1955వ సంవత్సరంలో అప్పటి సువిఖ్యాత గాయకి

## జీవితాన్ని ముందు చూపుతో జీవించాలి




* *జీవితం ఒక వ్యక్తి ఇచ్చే వయొలిన్ కచేరీలాంటిది. వయొలిన్‌ను వాయించడంలో ప్రావీణ్యత సాధన ద్వారానే వీలవుతుంది.*

* ముందుకు సాగిపోవడమే జీవితపు లక్ష్యం.

* *గతం ఆధారంగానే జీవితాన్ని అర్థం చేసుకోవాలి. కానీ జీవితాన్ని ముందుచూపుతోనే జీవించాలి.*

* 'ఆనందమే దివ్య ఔషధం' అన్నది అసలైన నిజం.

"పెండ్లి పంజరం లాంటిది. బయటి పక్షులు పంజరంలోకి రావడానికి ప్రయత్నిస్తే, లోపలి పక్షులు బయటకు పడడానికి ప్రయత్నిస్తాయి."
— మైఖేల్ డి మోంటెగ్నీ

అయిన కొరెట్టా స్కాట్ (Coretta Scott)ను పెండ్లి చేసుకున్నాడు. ఆ తరువాత అతడు డెక్స్టర్ అవెన్యూ బాప్టిస్ట్ చర్చిలో మతగురువు అయ్యాడు.

నీగ్రోల ఎన్నో పోరాటాలకు కింగ్ నేతృత్వం వహించాడు. మానవుడి పట్ల మానవుడి ప్రేమ అనే సిద్ధాంతాన్ని పాటించే కింగ్‌ను దేశ విదేశాలలోని నాయకులు బహుముఖంగా ప్రశంసించారు. "భగవంతుడి దృష్టిలో అందరూ సమానమే. రంగు వ్యక్తులను ఎప్పటికీ వేరు పరచదు" అని అతడనేవాడు.

నీగ్రోల హక్కుల కోసం పోరాడిన డా॥ కింగ్ ఒక నిరాడంబరి. ప్రచారం అతనికి నచ్చేది కాదు. అందరితోనూ ఏమాత్రం అరమరికలు లేకుండా కలిసి తిరిగేవాడు. ఆయనపై హత్యా ప్రయత్నాలు జరిగాయి. అయినా అతడు ఏమాత్రం బెదరలేదు.

1964వ సంవత్సరం డిసెంబర్ నెలలో ఇతడికి నోబెల్ శాంతి బహుమతి ఇవ్వబడింది. శాంతిదూత కింగ్, శాంతిపరమైన ప్రపంచపు అతిగొప్ప బహుమతి - నోబెల్ బహుమతి-ని అందుకున్నాడు.

గాంధీగారిలాగానే మృతవీరుడు కావాలని ఇతడి నొసట కూడా రాసి ఉంది. 1968వ సంవత్సరంలో టెన్నెసీ (Tennessee)లోని మెమ్ఫిస్ వద్ద ఒక ప్రదర్శనలో పాల్గొనేందుకు తయారవుతున్న తరుణంలో ఇతడు ఒక శ్వేత జాతీయుడి తుపాకీ గుండ్లకు గురి అయ్యాడు. ఇతని హత్యావార్త విన్న ప్రపంచం క్షణకాలం స్తంభించి పోయింది. "ఇతరుల కోసం ప్రాణాలను అర్పించే గొప్పవాడిని మించిన గొప్పవాడు ఇంతవరకు ఎవరూ పుట్టలేదు" అని పలికిన ఏసు ప్రభువు మాటలను, ప్రపంచం ఇతని మరణవార్తను విని గుర్తు తెచ్చుకుంది. ●

## లాభదాయకమైన నవ్వు




నవ్వు ఆరోగ్యానికి అత్యంత ఆవశ్యకమైన శారీరక వ్యాయామం అని సుమారు 2000 సంవత్సరాల క్రిందట గ్రీకు తత్త్వవేత్త అరిస్టాటిల్ వర్ణించాడు. మనిషికి ఒత్తిడి నుండీ నవ్వు వెంటనే ఉపశమనాన్ని ఇస్తుందన్న సత్యాన్ని ప్లేటో (Plato) లాంటి తత్త్వ శాస్త్రజ్ఞులు మొదలు ఫ్రాయిడ్ (Freud) లాంటి మనస్తత్వ శాస్త్రజ్ఞుల వరకు తెలియజేస్తూ వస్తున్నారు. గ్రంథులలో ఊరే రసాలను ఎక్కువగా ఊరింపజేసి నవ్వు జీర్ణశక్తిని పెంచుతుందనీ, కండరాలకు విశ్రాంతిని కలుగజేస్తుందనీ, బుగ్గలను ఎర్రబారేలా చేస్తుందనీ, కంటికి ఒక కొత్త వెలుగును ఇస్తుందని కూడా శాస్త్రజ్ఞులు తెలుపుతున్నారు.

"జ్ఞానార్జన, ధనార్జన, పర్వతారోహణ, కోరికలు నెరవేర్చుకోవడం, ధర్మ పరిపాలన - ఈ అయిదింటిలో తొందరపాటు పనికి రాదు."

— గరుడ పురాణం

# ఆశాజనకంగా ఆలోచించండి

ఓడిపోయాననుకుంటే మీరు ఓడిపోతారు.
సాహసం చేయలేననుకుంటే మీరు సాహసించలేరు.
మీరు జయించాలని ఇష్టపడి జయించలేనని ఆలోచించినప్పుడు మీరు జయించరు.




పోగొట్టుకుంటాము అని ఆలోచిస్తే పోగొట్టుకుంటారు.
కారణం ఈ ప్రపంచంలో మనోబలమే విజయరహస్యం.
మనసుంటే చూపుతుంది మార్గం.

మీరు అనుకుంటే అవుతారు అఖండులు,
మిమ్మల్ని ఎదగనిస్తాయి మీ కోరికలు,
కార్యాచరణకు ముందుండాలి దృఢనమ్మకం,
అప్పుడే మీరు గెల్చుకుంటారు బహుమానం.

బలవంతుడు లేదా ముందంజ వేసే వాడికే విజయం లభించదు ఈ జీవిత సమరంలో.
త్వరగా లేదా ఆలస్యంగా విజయం సాధించేది విజయం పొందగలను అన్న నమ్మకం గలవాడే. ●

## ఆణిముత్యాలు

### రహస్యాల్ని బయట పెట్టవద్దు

వరదల్లో కొట్టుకపోయే భూమిని ఎప్పుడూ దున్నకు. కరువు కాలంలో కూడా బంధువుల గడప తొక్కకు. నీకు తెలిసిన రహస్యాలను ఎప్పుడూ బయటపెట్టకు.

### అసలు సిసలైన ప్రేమ

పదిమంది నడచిన బాటకు పాచిపట్టదు. ఒకవేళ పట్టినా అది గట్టిగా నిలవదు. అదేవిధంగా వెలయాలి ప్రేమకు విలువ నివ్వకు. ఆ ప్రేమ అసలు సిసలైనది కాదు. ఒకవేళ ప్రేమ చూపినా అది చివరి వరకు ఉండదు.

### ఇచ్చిన మాటను మీరకు

మాట ఇచ్చిన తరువాత ఆ మాటను మీరకు. నీకు సహాయం చేసిన వ్యక్తి స్నేహ బంధాన్ని తెంచుకోకు.

### బుద్ధిహీనులకు మోక్షం

నీళ్ళు కలసిన పాలు, పాలలాగానే చెలామణి అయినట్లుగా బుద్ధిమంతులతో చేరే బుద్ధిహీనులకు వారితోపాటు మోక్షం లభిస్తుంది. — యోగి వేమన

[illegible] అనే అభిప్రా[illegible] పుష్పుతుంది"
— జాన్ సక్లింగ్

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి



## క్విజ్

1. మనదేశంలోని ఏ రాష్ట్రంలో తేయాకు ఎక్కువగా పండుతుంది?
(ఎ) కేరళ (బి) తమిళనాడు (సి) అస్సాం (డి) పశ్చిమ బెంగాల్.
2. మనదేశపు ఏ న్యాయశాస్త్ర నిపుణుడు (జూరిస్ట్) అంతర్జాతీయ న్యాయస్థానం (ఇంటర్నేషనల్ కోర్ట్ ఆఫ్ జస్టిస్) అధ్యక్షుడయ్యాడు?
(ఎ) బి.ఎన్. రావ్ (బి) నాగేంద్ర సింగ్ (సి) ఎన్. గోపాలస్వామి అయ్యంగార్ (డి) గోపాల్ స్వరూప్ పథక్.
3. మోషీదయాన్ ఏ దేశపు సుప్రసిద్ధ జనరల్:
(ఎ) సిరియా (బి) ఇరాక్ (సి) ఇజ్రాయిల్ (డి) ఈజిప్ట్.
4. జోడ్‌రెల్ బాంక్ (Jodrell Bank) అంటే ఏమి?
(ఎ) జోర్డాన్ దేశపు ఒక బాంక్ పేరు (బి) ఫ్రాన్స్‌లోని ఒక పురాతన గుహ (సి) అమెరికా సంయుక్త రాష్ట్రాల ద్వారా అంతరిక్షంలోనికి పంపబడిన ఒక కృత్రిమ గ్రహం (డి) యునైటెడ్ కింగ్‌డమ్‌లోని ఒక నక్షత్ర గణితశాల (అబ్జర్వేటరీ).
5. ఏ ఆటలో రాణించి మేజర్ ధ్యాన్‌చంద్ ప్రపంచ ప్రఖ్యాతిని పొందాడు?
(ఎ) ఫుట్‌బాల్ (బి) గోల్ఫ్ (సి) హాకీ (డి) వ్యాయామ క్రీడలు.
6. నల్లరేగడి భూములు ఎక్కువగా ఉన్న రాష్ట్రం
(ఎ) పంజాబ్ (బి) మధ్యప్రదేశ్ (సి) హర్యానా (డి) మహారాష్ట్ర.
7. ఆంగ్లపదం మల్టీనేషనల్ అర్థమేమి?
(ఎ) అనేక దేశాలలో వ్యాపారం చేస్తున్న కంపెనీ (బి) ఒకటికి మించిన దేశాలలో

## కొబ్బరినారతో తయారయే వస్తువుల పరిశ్రమలు

*మనదేశంలో కొబ్బరినారతో వస్తువులను తయారుచేసే పరిశ్రమలు 6040 దాకా ఉన్నాయి ఆంధ్రప్రదేశ్‌లో ఇలాంటి పరిశ్రమలు 123 దాకా ఉన్నాయి. తమిళనాడులో 700 పరిశ్రమలు నెలకొల్పబడ్డాయి. ఒక్క కేరళ రాష్ట్రంలోనే 4500 పరిశ్రమలున్నాయి. 6040 పరిశ్రమలలో 80 మాత్రమే రబ్బరుతో చేసిన త్రాళ్ళను తయారు చేస్తున్నాయి.*

"చుక్కల్లో చంద్రుడు జగతిని వెలిగించినట్లు నిరాశల్లో ఆశ బ్రతుకును ప్రకాశవంతం చేస్తుంది."

పారసత్వం ఉన్న వ్యక్తి (సి) అనేక దేశాలను పర్యటించిన వ్యక్తి (డి) ఇవేమి కాదు.

8. ప్రముఖ పాత్రికేయుడు ఖాసా సుబ్బారావు ఏ సంవత్సరం ఏ నెలలో పుట్టారు? (ఎ) 1896 జనవరి 23వ తారీఖున (బి) 1885 ఫిబ్రవరి 22వ తారీఖున (సి) 1899 జూన్ 16వ తారీఖున (డి) 1886 మే నెల 1వ తారీఖున.

## మాటల మహిమ

1. అదటు: (ఎ) అప్పుడు (బి) ఎదుట (సి) పిమ్మట (డి) అదరు.
2. ఇగము: (ఎ) చల్లదనం (బి) సగంలో సగం (సి) చిన్న కొండ (డి) మొలక.
3. ఎడరు: (ఎ) బాగా ఎండిన (బి) సమయము (సి) వికలమగు (డి) ఎతబాటు.
4. ఏకోను: (ఎ) ఏదో ఒక మూల (బి) మెచ్చుకోలు (సి) దూదిఏకు (డి) సమష్టి.
5. ఐవిల్లు: (ఎ) నట్టిల్లు (బి) మెట్టినిల్లు (సి) పుట్టిల్లు (డి) కలిపొచ్చిన ఇల్లు.
6. ఒళవు: (ఎ) లొసుగులున్న (బి) పాతది (సి) పనికిరాని (డి) వీణాదండము.
7. ఓరెము: (ఎ) అన్నము (బి) సహనము (సి) జయము (డి) ఒకవక్క.
8. ఔదల: (ఎ) అవతల (బి) నడితల (సి) వెనకాతల (డి) తలరాత.

## తెలివికి పరీక్ష

1. 'నాకు ఉగాదులు లేవు ఉషస్సులు లేవు' అని రాసిన తెలుగు కవి పేరేమి?
2. జ్ఞానపీఠ్ అవార్డును పొందిన తొలి తెలుగు కవి పేరేమి?
3. మన ప్రధానమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు ఏ తెలుగు నవలను ఏ పేరుతో హిందీ భాషలోకి అనువదించారు?
4. శ్రీకృష్ణుని శంఖం పేరు?
5. మనం ఒక మాట మాట్లాడుతున్నప్పుడు మొత్తం ఎన్ని కండరాలు పని చేస్తాయి?

(జవాబులకు వ పేజీ చూడండి)

## అధునాతన యుగపు సుందరీమణులు




* ఎలిజబెత్ టేలర్
* సోఫియా లారెన్
* ఆడ్రే హెప్‌బర్న్
* మొనాకో యువరాణి గ్రేస్ (ఈమె పేరు గ్రేస్‌కెల్లీ, హాలీవుడ్ నటి)
* మెర్లిన్ మన్‌రో

"ఒక అలవాటుని కిటికీలోంచి గిరవాటు వేయలేము - నెమ్మదిగా బుజ్జగిస్తూ, మెట్ల మీద నుంచి కిందికి దింపాలి." — మార్క్‌ట్వైన్

# నిజాలు - నిదర్శనాలు

## మామిడి పండ్ల ఎగుమతిలో ప్రథమస్థానం చేరనున్న భారతదేశం




1994 - 95 ఆర్థిక సంవత్సరంలో భారతదేశం 488.55 కోట్ల రూపాయల విలువగల మామిడి పండ్లను, ఇతర కూరగాయలను బయటి దేశాలకు ఎగుమతి చేసింది. భారతదేశం నుండి ఎగుమతి అయిన తాజా పండ్లలో మామిడి పండ్ల శాతం 40 దాకా ఉంది. మొత్తం ఎగుమతి అయిన మామిడి పండ్లలో ఒక అల్ఫోన్సో (Alphonso) రకం మామిడి పండ్లు 70 శాతం దాకా ఉన్నాయి.

## భారీ ఎత్తు పాల ఉత్పత్తిలో రెండవ స్థానం

అమెరికా సంయుక్త రాష్ట్రాల తరువాత భారీ ఎత్తు పాల ఉత్పత్తిలో మన దేశానికే రెండవస్థానం లభిస్తుంది

ప్రస్తుతం మన దేశంలో సాలీనా 55 మిలియన్ టన్నుల పాల ఉత్పత్తి జరుగుతున్నట్లు అంచనా వేయబడింది.

ఉత్పత్తి అవుతున్న పాలలో సుమారు 45 శాతం పాలు ద్రవరూపంలోనే మన దేశంలో వినియోగింపబడుతోంది. ఒక అంచనా ప్రకారం ఉత్పత్తి అవుతున్న పాలలో 34 శాతం పాలు నెయ్యిగా కాచబడుతోంది.

('ఎకనామిక్స్ టైమ్స్' సౌజన్యంతో)

## చేతితో తయారవుతున్న కాగితం విలువ

ఈ రోజు మన దేశంలో చేతితో కాగితాన్ని తయారుచేసే యూనిట్ల సంఖ్య 435 దాకా ఉంది. ఈ యూనిట్లలో సుమారు 12,000

## తెలివికి కొలత

| తరగతి | ఐక్యూ |
|---|---|
| అతి ఉత్తములు | 140కు పైగా |
| ఉత్తములు | 120 - 139 |
| సరాసరి రేఖకు పైనున్నవారు | 110 - 119 |
| సగటు మనుషులు | 100 - 109 |
| సరాసరి రేఖకు క్రింద ఉన్నవారు | 80 - 99 |
| సరాసరి రేఖలో ఉన్నవారు | 70 - 79 |
| మానసిక పెరుగుదల లేనివారు | 69 మరియు దానిలోపు |

"ప్రజల ప్రశంసలను ఖాతరు చేయకుండా అనుగ్రహంతో సంబంధం లేని సంతోషాన్ని అనుభవించేవాడే గొప్పవాడు." — సర్.ఆర్. స్టీలె

టన్నుల కాగితం కుటీర పరిశ్రమగా తయారవుతున్నది. ఈ కుటీర పరిశ్రమ అందాజుగా 7,500 మందికి ఉద్యోగావకాశాలను ఇస్తోంది. ఇక్కడ తయారవుతున్న చేతి కాగితం విలువ 15 కోట్ల రూపాయలుగా ఉంది.

## అత్యధిక రబ్బరు ఉత్పత్తి




రబ్బరు ఉత్పత్తి దృష్ట్యా భారతదేశం నాల్గవ స్థానంలో ఉంది. రబ్బరును ఉత్పత్తి చేస్తున్న ముఖ్యమైన దేశాలలో సరిపోల్చినప్పుడు మన దేశంలో రబ్బరు ఉత్పత్తి, ఎక్కువ ఉన్నట్లు ఋజువైంది. ప్రతి హెక్టారు రబ్బరు తోటలో ఉత్పత్తి 1,265 కి.గ్రా.లుగా ఉన్నట్లు లెక్కలు తెలియజేస్తున్నాయి.

## పాఠశాలలకు పోని 130 మిలియన్ పిల్లలు

అంతరిక్ష దిగ్విజయ యాత్రలు చేస్తున్న కృత్రిమ తెలివితేటలను పొందుతున్న జన్యుల రహస్యాలను చేదిస్తున్న ఈ రోజులలో కూడా 6 మొదలు 11 సంవత్సరాలలోపు వయసు ఉన్న 130 మిలియన్ పిల్లలు పాఠశాలలకు వెళ్ళడం లేదు. వీరు కాకుండా జనాభాలోని 15 సంవత్సరాల వయసుకు పైబడిన 965 మిలియన్ల ప్రజలు నిరక్షరాస్యులుగా ఉన్నారు.

— (యునెస్కో సౌజన్యంతో)

●

## "నేను నీ భార్యను"

భర్త ఆల్‌బర్ట్‌పై బ్రిటన్ దేశపు మహారాణి విక్టోరియా కోపంతో విరుచుకపడింది. మారు మాట్లాడకుండా అతను అక్కడనుండీ తన గదికెళ్ళి తలుపులు వేసి లోపలినుండి గడియ పెట్టుకున్నాడు. కోపంతో ఊగిపోతూ మహారాణి ఆల్‌బర్ట్‌ను అనుసరించింది. మూసిన తలుపుల్ని గట్టిగా తట్టింది. 'నేను మహారాణి విక్టోరియాను, ఆజ్ఞాపిస్తున్నాను తలుపులు తెరువు' అంది లోపలినుండీ ఎలాంటి బదులు మహారాణికి వినిపించలేదు. కొంతసేపైన తరువాత మంద స్వరంతో "ఆల్‌బర్ట్, నేను నీభార్యను తలుపులు తెరువు" అన్నది. మరుక్షణం తలుపులు తెరుచుకున్నాయి.

## ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా విద్య

ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా విద్య (Correspondence Education) నభ్యసించే పద్ధతిని మనదేశంలో తొలిసారిగా ఢిల్లీ విశ్వవిద్యాలయం వారు 1962వ సంవత్సరంలో ప్రవేశపెట్టారు.

"మనల్ని ప్రశంసించేవారు మనకు నచ్చుతారు. కానీ మనం ప్రశంసించే వారు మాత్రం మనకు నచ్చరు." — లా రోచే ఫౌకాల్డ్

# భూప్రదక్షిణం

## నమీబియా

ఒకప్పుడు నైఋతి ఆఫ్రికాగా పరిగణింపబడిన ప్రాంతం ప్రస్తుతం నమీబియాగా పిలువబడుతోంది. దక్షిణ ఆఫ్రికాలోని అట్లాంటిక్ మహాసముద్రం కోస్తా ప్రాంతంలో ఈ దేశం ఉన్నది. 824, 292 చ.కి.మీ.ల వరకు విస్తరించిన ఈ దేశాన్ని 14 ప్రాంతాలుగా విభజించారు. ఈ దేశంలో సుమారు 1,596,000 మంది నివసిస్తున్నారు.




ఒవాంబో (Ovambo), కవాంగో (kavango), డమర (Damara), హెరెరో (Herero), నమ (Nama), బుష్‌మాన్ (Bushman) మొదలైన తెగలకు చెందిన నల్ల ఆఫ్రికా వాసులు ఈ దేశంలో నివసిస్తున్నారు. ఇక్కడి జనాభాలో తెల్లవారి శాతం 15 మాత్రమే. ఇక్కడి ప్రజలు ఆఫ్రికన్స్, జర్మన్‌తో పాటు అనేక కొండజాతి భాషలను మాట్లాడుతారు. కానీ ఈ దేశం అధికార భాషగా ఇంగ్లీమ ఇంకా కొనసాగుతూనే ఉంది

ఈ దేశపు మధ్య పీఠభూమి ప్రాంతంలో ఉన్న విండ్‌హెూక్ (Windhoek) ఈ దేశపు రాజధాని నగరం. ఇక్కడ సుమారు 114,000 మంది జనం నివసిస్తున్నారు. వాల్‌విస్ బే (Walvis Bay) అన్నది ఈ దేశపు ప్రధాన ఓడరేవు పట్టణం. ఇక్కడి ప్రజలు క్రైస్తవమతం లేదా కొండ జాతులకు చెందిన మతాన్ని పాటిస్తారు ఈ దేశపు కరెన్సీ రేండ్ (Rand).

విస్తృతమైన నామిబ్ (Namib) ఎడారిలో జనులు నివసించడం లేదు. ఈ భాగం అట్లాంటిక్ కోస్తా ప్రాంతం పడమటి భాగాన్ని మరుగుపరుస్తుంది. నమీబియా దేశపు ఇతర భాగాలు పీఠభూములు మరియు కొన్ని పర్వతాలతో నిండి ఉన్నాయి. అరుదుగా భారీ వర్షాలు ఇక్కడ పడుతుంటాయి. ఆ ఋతువులో తప్ప ఇతర ఋతువులలో

## యాత్రికులు అరుదు!

*మారుమూల గ్రామానికి ఒకసారి ఒక పర్యాటకుడు వెళ్ళాడు రెండు గుడ్ల ఆమ్లెట్‌కు ఒక దుకాణాదారుడు 10 రూపాయలను వసూలు చేసాడు. ఎక్కువ వెలకు ఆశ్చర్యపోయి, "ఈ ప్రాంతాలలో కోడిగుడ్లు దొరకవా?" అని ప్రశ్నించాడు. "గుడ్లు కాదుకాని పర్యాటకులు చాలా అరుదుగా దొరుకుతారని" దుకాణాదారుడు బదులు ఇచ్చాడు.*

"అహంకారం అనర్థానికి దారితీస్తుంది." — రోజ్‌పాల్

నదిలో నీరు ప్రవహించే ప్రాంతం సాధారణంగా ఎండిపోతుంటుంది కొద్ది సంఖ్యలో ఉన్న నదులు, తక్కువ వర్షపాతం ఇవి రెండూ కలిసి వాతావరణాన్ని పొడిగా మార్చేస్తాయి

ఈ దేశపు చాలా భాగం భూములు వ్యవసాయానికి పనికిరావు. వచ్చిక బయళ్ళను పెంచే అలవాటు చాలామంది తెల్లవారికి ఉన్నది. ఆ దేశపు నల్లవారైన ఆఫ్రికన్లు పశువుల కాపర్లుగా పనిచేస్తుంటారు. ఈ దేశం ఆదాయానికి ప్రధాన సాధనం మత్స్య పరిశ్రమ

ఈ దేశపు స్థూల జాతీయోత్పత్తికి సంబంధించిన రాబడి 40 శాతం దాకా గనుల త్రవ్వకాల పనుల ద్వారా లభిస్తోంది


Man from Namibia (Black African)

ఈ దేశంలో వజ్రాలు, బంగారు, ఉప్పు, యురేనియం, వనడియం, రాగి, జింక్, జర్మేనియం, మాంగనీసు, సీసం మొదలైన ఖనిజాల నిలవలు ఉన్నాయి. కానీ గనుల త్రవ్వకాలలో వీరు ఇంకా బాగా అభివృద్ధి సాధించాల్సి ఉంటుంది.

వరి, గోదుమ, జొన్నలు, సోర్ఘమ్ (Sorgham) మొదలైనవి ఇక్కడి ప్రధాన పంటలు. తోలు పరిశ్రమ, వస్త్ర పరిశ్రమ,


Woman Working in a factory, Namibia


Male Namibian Workers

పశువుల పెంపకం, పండ్లు, మాంసం ఇత్యాదులను భద్రపరచు పరిశ్రమ (Canning), పాడిపంటలు మొదలైనవి ఇక్కడి ప్రధాన పరిశ్రమలు. ఈ దేశం నుండీ వజ్రాలు, రాగి, సీసం, జింక్, యురేనియం, చేపలు,

## 6 లక్షల మందికి ఉద్యోగాలిస్తున్న అల్లికల పరిశ్రమ

*ప్రత్యక్షంగానో లేదా పరోక్షంగానో మేజోళ్ళు, బనియన్‌లను తయారుచేసే పరిశ్రమల సంఖ్య సుమారు 17,000 ఉంది. ఈ పరిశ్రమ ప్రత్యక్షంగానో లేదా పరోక్షంగానో సుమారు 5,6 లక్షల మందికి ఉద్యోగాల్ని ఇస్తుంది.*

"ఇష్టమైన పని ఎంత చేసినా కష్టమనిపించదు."

పశువులు ముఖ్యంగా ఎగుమతి అవుతున్నాయి.

మొదట్లో ఇక్కడ డమర (Damara) తెగకు చెందిన ప్రజలు జీవించేవారు. 1884 లో నమీబియా జర్మనీ దేశానికి చెందిన వలస రాజ్యంగా మారింది. అప్పట్లో జర్మన్ వ్యాపారులు అక్కడ తమ వ్యాపార కేంద్రాల్ని నెలకొల్పారు. ఆ రోజుల్లో దీన్ని అధికారయుక్తంగానే నైఋతి ఆఫ్రికా అని పిలిచేవారు.



Windhoek, capital of Namibia

మొదటి ప్రపంచ యుద్ధం - 1915 - కాలంలో లూయిస్ బోతా (Louis Botha) నాయకత్వంలో సైన్యాలు జర్మన్ దేశీయులను దక్షిణ ఆఫ్రికానుండీ బలవంతంగా తరిమివేసాయి. అప్పట్లో ఉన్న నానాజాతి సమితి (League of Nations) 1920 వ సంవత్సరంలో దక్షిణ ఆఫ్రికాకు ప్రతినిధులను ఎన్నుకునే అధికారం ఇచ్చింది.

దక్షిణ ఆఫ్రికా ప్రతినిధులను ఎన్నుకునే అధికారం ఉన్న ప్రాంతం కావడంతో నమీబియాలో ప్రజల చేత ఎన్నుకోబడిన అసెంబ్లీ పరిపాలనా కార్యభారాన్ని నిర్వహిస్తూ ఉండేది. కానీ శ్వేత జాతీయులకు మాత్రమే ఓటు హక్కు ఇవ్వబడింది. 1966లో ఐక్య రాజ్యసమితి ఎన్నికలు జరుపుకునే ఉత్తరువును రద్దు చేసింది. కానీ శ్వేత జాతీయులు తమ ప్రాంతాన్ని స్థానికులకు అప్పజెప్పేందుకు నిరాకరించారు. నైఋతి ఆఫ్రికా ప్రజల సంస్థ (South West Africa Peoples Organisation - SWAPO) 1966 నుండి గెరిల్లా యుద్ధనీతిని అవలంభించి పోరాటం జరపటంతో దక్షిణ ఆఫ్రికా, అంగోలా, క్యూబాలు కలిసి 1988లో ఒక ఒడంబడికపై సంతకాలు చేసారు. ఈ ఒడంబడిక నైఋతి ఆఫ్రికాపై నమీబియా దక్షిణ ఆఫ్రికా పరిపాలనా అధికారాన్ని అంతం చేసి ఆదేశం స్వతంత్రం కావడానికి కావలసిన సంధికాలాన్ని నిర్ణయించింది. స్వాపో (Swapo) ను బలపరచిన క్యూబా,

## 7,000 రకాల సీతాకోకచిలుకల సేకరణ

వాయవ్య ఐరోపాకు చెందిన ఇస్టోనియా (Estonia)లోని కోహ్‌ట్లా జార్వే (Kohtla Jarve) నగరంలో నివసించే రాబర్ట్ సురపేరే (Robert Suurpere) అన్ని రకాలకు చెందిన 7,000 సీతాకోక చిలుకలను సేకరించాడు. ఇతని సేకరణలో రెక్కల పొడవు 15 సెం.మీ.లు ఉన్న 'రాక్షస' సీతాకోక చిలుకలతో పాటు భూతద్దం ద్వారా మాత్రమే చూడగల సూక్ష్మమైన సీతాకోకచిలుకలు కూడా ఉన్నాయి.

"దున్నని నేల, సంస్కారం లేని మనసు ఎప్పుడూ మంచి ఫలాలను ఇవ్వలేవు."

— సెనెకా

అంగోలాలు, ఈ ఒడంబడిక తరువాత తమ తమ సైన్యాలను నమీబియా నుండీ ఉపసంహరించుకున్నాయి.



Walvis Bay – Chief seaport of Namibia

రాజ్యాంగ పరిషత్తు (కాన్స్టిట్యుయంట్ అసెంబ్లీ)కు సంబంధించిన ఎన్నికలు నమీబియాలో మొట్టమొదటిసారి 1989వ సంవత్సరం నవంబరు నెల 7వ తారీఖున జరిగాయి. ఎన్నుకోబడిన రాజ్యాంగ పరిషత్తు అనేక రాజకీయ పార్టీలతో కూడుకున్న ప్రభుత్వం ఏర్పాటు చేసుకునేందుకు అనువుగా ఉండే రాజ్యాంగాన్ని 1990వ సంవత్సరం ఫిబ్రవరి నెల 9వ తారీఖున ఒక తీర్మానాన్ని ఆమోదించింది. ఆ తరువాత 1990 వ సంవత్సరం మార్చి నెల 21 వ తారీఖున నమీబియా సర్వ స్వతంత్ర దేశంగా ఆవిర్భవించింది. ఆ స్వాతంత్ర్య దినోత్సవం నాడు స్వాపో పార్టీకు చెందిన సేమ్ నుజోమా (Sam Nujoma) ఆదేశపు తొలి అధ్యక్షుడిగా ఎన్నుకోబడ్డాడు.

●

## [illegible]

ఆదిమవాసులు గ్రహణాలను చూసి ముఖ్యంగా సూర్యగ్రహణాన్ని చూసి భయపడే వారు. ఆకాశంలో డ్రాగన్ (రెక్కలున్న పాము లేదా మొసలి) సూర్యుడిని కబళించడానికి ప్రయత్నించినప్పుడు సూర్యగ్రహణం ఏర్పడుతుందని ప్రాచీన కాలానికి చెందిన చైనీయులు భావించేవారు. మనదేశంలో కూడా పాము చంద్రుణ్ణి మింగడంవల్లనే చంద్రగ్రహణం సంభవిస్తుందన్న నమ్మకం ప్రచారంలో ఉంది. ఒకప్పుడు గ్రహణం కారణంగా ఒక యుద్ధం శాంతివంతంగా ముగిసింది. క్రీ.పూ 585వ సంవత్సరంలో సూర్యగ్రహణం రావడంతో దాన్ని చూసి అంతవరకు అయిదు సంవత్సరాల కాలంగా విడువకుండా పోరాడిన మేడెస్ (Medes) ప్రజలు లిడియన్లు (Lydians) తమ తమ ఆయుధాలను పడవేసి రాజీపడ్డారు. క్రీ.పూ. 413వ సంవత్సరంలో ఏథెన్స్‌కు చెందిన సైనికులు సిసిలీ (Sicily)లో అప్పుడు సంభవించిన గ్రహణాన్ని చూసి దాన్ని దుశ్శకునంగా భావించి అక్కడే ఆగిపోయారు. శత్రు సైన్యాలు వారిని ఆ కారణంగా పూర్తిగా హతమార్చాయి. ఈ వివరాలను గ్రీకు దేశపు చరిత్రకారులు నమోదు చేసారు. వారు గ్రహణాల తారీఖులను కూడా సరిగ్గా నమోదు చేయడంవల్ల చారిత్రక సంఘటనలు ఏ తారీఖున జరిగాయో చెప్పడానికి వీలవుతోంది.

— డా॥ ఎస్. జ్ఞానశేఖరన్

## అవకాశవాది!

కాలు జారి బావిలో పడినందుకు కనీసం స్నానం చేసి బయటపడదాం అని నిర్ణయించుకునే వ్యక్తి ఆశావాది.

"పేదవారిని [illegible] చేయనిచ్చే ఏ దేశం ప్రగతిని సాధించలేదు."

— హైన్‌రిచ్ పెస్టాలోజ్జి

# హాస్య వినోదం

## ఇంతమంది ఆడవారు నిలవడం నాకు అసలు పడదు .

క్రిక్కిరిసిన బస్సులో పక్కపక్కన కూర్చొని ఇద్దరు మిత్రులు ప్రయాణం చేస్తున్నారు. తన మిత్రుడు కళ్ళు మూసుకుని ఉండడం రెండో మిత్రుడు చూసాడు. "మిత్రమా ఒంట్లో బాగాలేదా?" అని ప్రశ్నించాడు.

"బాగానే ఉన్నాను, ఇంతమంది ఆడవాళ్ళు నిలవడాన్ని చూడడం నాకు అసలు పడదు" అని కళ్ళు మూసుకునే జవాబిచ్చాడు.



## గంటలు కొట్టని గడియారం

ఒక వాగుడుకాయతో ఆంగ్లేయ నవలా కారుడూ, పాత్రికేయుడూ అయిన శామ్యూల్ జాన్సన్ ఇలా అన్నాడు: "నిమిషాలను చూపి గంటలు కొట్టని గడియారం లాగా మీరు మాట్లాడుతారు."

## నేను పంచె కట్టుకునే వచ్చాను

"ఇంతకు ముందెప్పుడైనా సాక్షిగా బోనెక్కావా?"

"చిత్తం జడ్జిగారు"

"ఏ సూటు (Suit)లో?"

"సూటులో నేను రాలేదండి. క్రితం సారి కూడా పంచకట్టుకునే వచ్చాను."

— (పార్థ)

## నీవు చేయగలిగింది చేయి

జడ్జి (వయసు మళ్ళిన ఖైదీతో): "14 సంవత్సరాల కఠిన కారాగార శిక్షను విధిస్తున్నాను."

ఖైదీ (కన్నీళ్ళతో): "అయ్యా ఈ శిక్ష అనుభవించడానికి నేను అన్ని సంవత్సరాలు బ్రతకను."

జడ్జి (దయతో): "మరేం బాధపడకు. నీవు చేయగలిగింది చేయి." (పార్థ)

## జయాన్ని కోరే వ్యక్తి

అనుభవజ్ఞుడినీ, విషయం తెలిసిన వ్యక్తినీ, వివేకం ఉన్న వ్యక్తినీ, సుగుణాలు ఉన్న వ్యక్తినీ, నమ్మకస్తుడైన స్నేహితుణ్ణీ, గౌరవించి సంప్రదించే వ్యక్తే తాను తలబెట్టిన కార్యంలో విజయాన్ని సాధించగలడు.

—మహాభారతం

"నాలుకను హద్దులో పెట్టుకున్న మూర్ఖుడు మహాత్ముడుగా చలామణీ అవుతాడు."

— సైరస్

## వేగాన్ని 120 కి.మీ.కు పెంచుతాను

పోలీసు శాఖకు కావలసిన అభ్యర్థులను ఎన్నుకొనే ఇంటర్వ్యూలో ఒక అభ్యర్థిని పోలీసు అధికారి ఇలా ప్రశ్నించాడు: "పోలీసు కారులో మీరొక్కరే ఉన్నారను కోండి. కొంతమంది దుండగులు అలక్ష్యంగా ఒక కారును గంటకు 90 కి.మీ.ల వేగంతో వెంటపడుతున్నారనుకోండి. అప్పుడు మీరేం చేస్తారు?"

"ఏముంది మా పోలీసుకారు గంటకు 120 కి.మీ.ల వేగంతో వెళుతుంది" అని నవ్వుతూ ఆ అభ్యర్థి జవాబిచ్చాడు.



## మీరు తొందరపెడుతున్నారు

ఆదివారం రోజు చర్చిలో మతాధికారి తన దివ్య సందేశాన్ని వినిపిస్తున్నాడు. ఉన్నదున్నట్టు ఒక శిశువు ఏడుపు లంకించుకుంది. ఏడుస్తున్న శిశువును బయటకు తీసుకువెళ్ళడానికి తల్లి లేచి ద్వారం దాకా వచ్చింది. ఆ తల్లిని ఆపుచేస్తూ మతాధికారి "మీ శిశువు నన్ను ఏమాత్రం తొందరపెట్టడం లేదు" అన్నాడు.

ఆ మతాధికారి వైపుకు తిరిగి "ఆ విషయం నాకు తెలుసండి. అయితే మీరు నా శిశువును ఇబ్బంది పెడుతున్నారు" అని చెప్పింది.

## ఇప్పుడు నిమిషాల పొడవు పెరిగిందా?

ఊరు తీసుకువెళతానన్న తల్లి కోసం నాలుగేండ్ల రోడరిక్ ఓపికతో ఎదురు చూస్తున్నాడు. అయిదు నిమిషాలలో తయారైవస్తానన్న తల్లి ఎంతకూ రాక పోవడంతో రోడరిక్ విసుగెత్తిపోయాడు. ఇక లాభం లేదని ఓపిక నశించిన రోడరిక్ "అమ్మా! ఇప్పుడు నిమిషాల పొడవు ఇది వరకు కంటే ఎక్కువ పెరిగిందా?" అని ప్రశ్నించాడు. — పేరంట్స్ మాగజైన్

(ఇన్స్పిరేషనల్ కోట్స్)

## అమెరికా దేశపు అతి పెద్ద ధనవంతుడు

*8.2 బిలియన్ డాలర్ల (8,200 మిలియన్ డాలర్లు) ఆస్తి వరుడైన శ్రీబిల్ గేట్స్‌ను అమెరికా దేశపు అతిపెద్ద ధనవంతుడు. అమెరికాలోని కంప్యూటర్ కంపెనీ మైక్రోసాఫ్ట్ కార్పొరేషన్ సహస్థాపకులలో ఇతను ఒకడు.*

(ఫోర్బ్స్)

"విజయం సాధించాలన్న మన నిర్ణయం అంత బలమైనది కాదన్న సత్యాన్ని మన అపజయం నిరూపిస్తుంది." — బోవీ

# శత్రువు యొక్క గొప్పతనం

సంకలనం: స్వర్గీయ శ్రీ ఎఫ్.సి. సోంధి

1572వ సంవత్సరం. రాజస్థాన్ లోని మేవార్ ప్రాంతపు ఒక అడవి.

బాగా మబ్బులు కమ్ముకున్న సాయంకాలం రాణా ప్రతాపసింహుడు ఒక చెట్టు నీడలో విశ్రమించి ఉన్నాడు. తాను ఆ దృశ్యాన్ని చూసి ఆశ్చర్యచకితుడయ్యాడు. "అమర్ సింగ్ వారెవరు?" అని రాణా ప్రతాపుడు ఆరాతీసాడు.



RANA PRATAP

"మన దళాల ద్వారా పట్టుబడిన మీర్జా ఖాన్ బేగంలు (భార్యలు)" సైన్యాధ్యక్షుడు అమర్‌సింగ్ జవాబు ఇచ్చాడు. "మరి వారిని ఎందుకు బందీ చేసారు?" అని రాణా ప్రశ్నించాడు.

"వారు మనవారి చేత యుద్ధంలో దోచుకున్న సంపద" అమర్‌సింగ్ జవాబు.

"ఏంటి? దోచుకున్న సంపదా? స్త్రీలను సంపదగా భావించామని అంటున్న నీకు ఎంత ధైర్యం?"

"మన శత్రు శిబిరాలలో ఉన్నవారిని మనవారు బందీ చేసారు" అణుకువతో అమర్‌సింగ్ వివరణ ఇచ్చాడు.

"అయితే ఏమి? వారు శత్రువుల సంబంధించిన వారైనంత మాత్రానా ఆడవారు కారా? స్త్రీలు తల్లులతో సమానం! వారు దేవతలు" అని రాణా ప్రతాపసింహుడు అన్నాడు.

రాణాప్రతాపసింహుడు కోపంతో, "చూడు అమర్‌సింగ్, నిన్ను నీవు దిగజార్చుకుంటున్నావు. అంతేకాదు మనజాతికి తలవంపులు తెచ్చావు. నాకు నారెండు చేతులను నరుక్కోవాలనిపిస్తుంది"

కోపంతో పండ్లు కొరుకుతూ "ఆ గౌరవనీయులైన స్త్రీల వద్దకు వెంటనే పోయి క్షమాపణలు కోరు. వారిని వెంటనే మీర్జాఖాన్

## ఏమైనా జరిగిందా?

యజమాని. "నీవు తొమ్మిది గంటలకు వచ్చి ఉండవలసింది."

ఆలస్యంగా వచ్చే నౌకరు "ఎందుకు? ఏమైనా జరిగిందా?"

"సమాజం తయారు చేసిన నేరాన్ని నేరస్థుడు నెరవేరుస్తాడు."

— హెన్రీ థామస్ బకిల్

శిబిరానికి పంపించు. నేను కూడా వారిని క్షమాపణలను కోరుతాను" అని ఆజ్ఞాపించాడు.

అందరూ వెళ్లిపోయిన తరువాత రాణా ప్రతాపసింహుడు తనలో తాను ఇలా అనుకున్నాడు: "మమ్మల్ని సమూలంగా నాశనం చేయడానికీ, మా ప్రాంతాలను బలవంతంగా ఆక్రమించుకునేందుకూ అక్బర్ ఈ మీర్జాఖాన్‌ను పంపాడు. అమర్‌సింగ్ బహుశా మీర్జాఖాన్ గర్వాన్ని అణచాలని అనుకుని ఉంటాడు. దురదృష్టవంతులైన ఆ స్త్రీలను అతడు అందుకే బందీలను చేసి ఇక్కడకు తెచ్చి ఉంటాడు"

అక్కడ తన శిబిరంలో మీర్జాఖాన్‌కు ఏ ముఖం పెట్టుకుని అక్బరు ముందు నించోవాలో అర్థం కాలేదు. మేవార్‌ను స్వాధీన పరచుకుని, రాణాప్రతాపసింహుడిని ఓడించడానికే అక్బర్ మీర్జాఖాన్‌ను పంపాడు. కానీ ఇప్పటికే వేల సంఖ్యలో మీర్జాఖాన్ సైనికులు రాజపుత్ర వీరులచే హతమార్చబడ్డారు. ఇంతకంటే అవమానకరమైన విషయం అతని భార్యలు పట్టుబడ్డారు.

అప్పుడే అతని భార్యలు తిరిగివచ్చారన్న కబురు అందింది. తన కండ్లను మీర్జాఖాన్ తానే నమ్మలేకపోయాడు. అతని భార్యలు రాజపుత్ర వీరుల సంరక్షణలో ఉన్నారు.

మీర్జాఖాన్ తనలో తాను ఇలా అనుకున్నాడు: "ఎంత గొప్ప శత్రువు. ప్రతాపసింహుడిది ఎంత గొప్ప ఔదార్యం. కటిక దారిద్ర్యాన్ని అనుభవిస్తూ కొండంత మొగల్ సైన్యాలను ఎదిరిస్తున్నాడు. ఈ విపత్కర పరిస్థితులలో కూడా తన మంచి స్వభావాన్ని, గుణశీలాన్ని విడనాడలేదు."

— 'ఐడియస్ ఎక్స్చేంజ్' సౌజన్యంతో

●

## బాగా వక్షీలు కొట్టగల ప్రొబోసిస్ జాతి కోతులు




పెద్ద ముక్కున్న కోతులను ప్రొబొసిస (*Proboscis*) కోతులంటారు. ఈ రకం కోతులు ఆగ్నేయ ఆశియా ఖండంలోని బోర్నియో (*Borneo*) రావిచెట్టులాంటి చెట్ల అడవులలో ఎక్కువగా నివసిస్తుంటాయి. ఈ రకం కోతులు వల్టీలు కొట్టడంలో సహజంగా ప్రావీణ్యతను పొంది ఉంటాయి. 30 అడుగుల దూరంలో ఉన్న ఒక కొమ్మ నుండి మరో కొమ్మకు ఇవి చాలా అవలీలగా దూకుతాయి. ఈ రకం కోతులకు ముక్కే ఒక అందం. ఆడ కోతులు బాగా పెద్ద ముక్కు ఉన్న మగ కోతులను తమ జంటగా ఎన్నుకుంటాయి. పెద్ద ముక్కు లైంగిక ఆకర్షణకు ప్రధాన హేతువు!

"నెరసిన తల వెంట్రుకలు వివేకాన్ని కాదు వయసును సూచిస్తాయి."

— గ్రీక్ సామెత

# నమ్మలేని నిజాలు

* అల్‌బట్రాస్ (ఒక రకమైన సముద్ర పక్షి) చాలాదూరం వరకు సునాయాసంగా ఎగురగలిగిన పక్షి. ఇది రోజంతా ఎగురుతూనే ఉంటుంది. కానీ ఒక్కసారి కూడా ఇది తన రెక్కలను కదిలించదు. ఈ పక్షి రెండు సంవత్సరాల కొకసారి ఒకే ఒక గుడ్డును పెడుతుంది.




* ఒక్క హమ్మింగ్ బర్డ్ మాత్రమే ముందుకు, వెనక్కు కూడా ఎగురగలదు.

* చంద్రుడి ఉపరితలంపై కూడా టిటానియం కనుగొనబడింది.

* మన శరీరంలో ఉన్న అతి చిన్నదైన జీవకణం మామూలు గుండుసూది తల పరిమాణంలో 20,000 అంత చిన్నదిగా ఉంటుంది.

*స్టార్ ఫిష్‌ను [illegible] ముక్కలు ముక్కలుగా కోసినా ప్రతి ముక్క మరో స్టార్‌ఫిష్‌గా ఎదగలదు.

* ఆకారం, బరువు దృష్టితో చూచినప్పుడు పక్షి ఈకను ఈ ప్రపంచపు అతి బలిష్టమైన సహజ నిర్మాణంగా భావించాలి.

* కంగారూ ఎలుక (Kangaroo Rat) తన జీవితకాలంలో నీరు తాగదు

* వాతావరణ కాలుష్యానికి సంబంధించిన సంకేతాలను లిచెన్ (Lichen) మొక్క ఇవ్వగలదు. — నిలిప్ దేవ్

— ('ది టీనేజర్')

## పరిస ముత్యాలు

* అన్నిటికంటే తీయనిది పొగడ్త
* నోరు విప్పడం కంటే చెవులు విప్పడం మేలు
* రోగాలన్నిటిలోను చికిత్సకు లొంగనిది 'అహంభావం'
* సద్గుణాన్ని మించిన సౌందర్యం లేదు
* సత్యమనే దీపమే నిజమైన దీపం
* అన్ని మతాల కంటే గొప్ప మతం - నిస్వార్థ సేవ.
* పుస్తకాలు లేని ఇల్లు కిటికీలు లేని గది లాంటిది
* విమర్శలన్నిటిలో గొప్పది - ఆత్మవిమర్శ.
* ఎన్ని మంచిమాటలైనా ఒక్క మంచి పనికి సాటిరావు.
* స్నేహితుడు లేని జీవితం సాక్ష్యం లేని కేసులాంటిది.

— సేకరణ: [illegible] గోపాలరావు

"ఎవరూ ఎలాంటి తప్పు పట్టలేని విధంగా పని చేయాలని ఎదురు చూసే వ్యక్తి ఏ పనీ చేయలేడు" — కార్డినల్ న్యూమాన్

# మీకు తెలుసా?

## స్థలాలకు సంబంధించిన వింత వాస్తవాలు

శ్రీకృష్ణ పరంజ్‌పే

వాషింగ్టన్ డి.సి - డి.సి. అన్నమాట కొలంబియా జిల్లా (District of Columbia) ను సూచిస్తుంది.


Tokyo—Capital of Japan

నార్వే - ఈ దేశాన్ని అర్ధరాత్రి సూర్యుడి దేశం అంటారు, ఇక్కడ ప్రతి సంవత్సరం మే నెల మొదలు జూలైనెల ఆఖరి వరకు సూర్యుడు అస్తమించడు.

ఎర్‌పోర్ట్ - చికాగోలోని అంతర్జాతీయ విమానకేంద్రం ఎప్పుడూ సందడిగానే ఉంటుంది. ఇక్కడ ప్రతి గంటకు సరాసరిగా 85 విమానాలు దిగడం గానీ, ఇక్కడి నుండి ఇతర ప్రాంతాలకు ఎగరడం గానీ జరుగుతుంధి.

టోక్యో - ఈ నగరంను ప్రాచీన కాలంలో ఎడో (Edo) అని పిలిచేవారు.

లాండ్ ఆఫ్ లేక్స్ - ఫిన్‌లాండ్‌లో 60,000 సరస్సులు ఉన్నాయి. అందుకే దీన్ని సరస్సుల దేశం అంటారు.

సుడాన్ - ఆఫ్రికాలోని సుడాన్ చుట్టూ ఎనిమిది దేశాలు - ఈజిప్ట్, లిబియా, ఛడ్, సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్, జైరే, యుగాండా, కెన్యా ఎథియోపియా ఉన్నాయి.

ఇటలీ - ఇటలీ దేశం ఒక పడవ ఆకారంలో ఉంటుంది.

సైబీరియా - 19 వ శతాబ్దం వరకు బాగా గట్టిపడిన టీ ముద్దలను ఆదేశపు కరెన్సీగా వాడేవారు.

ఈజిప్ట్ - తమ దేశపు పంచాంగాన్ని సాలీనా నైలునదిలో వచ్చే వరదల ఆధారంగా తయారుచేసుకునేవారు.

— 'ది టీనేజర్' సౌజన్యంతో

## గొప్పలు చెప్పుకునేవాడు

గొప్పలు చెప్పుకునేవాడికి ఒక సుగుణం ఉంటుంది. అతడు ఇతరులను గురించి ఒక్క మాట కూడా మాట్లాడడు.

"చిన్న విషయాలు అధములను గర్వపడేలా చేస్తాయి."

— విలియం షేక్స్పియర్

# వీరిని గురించి తెలుసుకోండి

బెంజిమిన్ ఫ్రాంక్లిన్: అమెరికాకు చెందిన రాజనీతిజ్ఞుడు. ఇతడు గొప్ప విజ్ఞానవేత్త కూడా. మెరవు ఒక రకమైన విద్యుచ్ఛక్తి అన్న విషయాన్ని ఇతడు సహేతుకంగా నిరూపించాడు. స్వాతంత్ర్య తీర్మానాన్ని తయారు చేయడంలో ఇతను సహాయపడ్డాడు. ఇతడు ఊగే కుర్చీని కూడా కనుగొన్నాడు.




మార్టినా నవరతిలోవా (యుఎస్ఎ): మహిళా టెన్నిస్ చరిత్రలో అపూర్వమైన విజయాలను సాధించిన వ్యక్తి. తొమ్మిదిసార్లు ఈమె వింబుల్డన్ ఛాంపియన్‌షిప్‌ను గెల్చుకుంది. 22 సంవత్సరాల టెన్నిస్ జీవితంలో 167 సింగిల్స్ టైటిల్స్ గెల్చుకుని ఒక గణనీయమైన కొత్త చరిత్రను సృష్టించింది.

మార్టిన్ లూథర్: క్రైస్తవులలోని ప్రొటెస్టెంట్ శాఖను ప్రారంభించిన వ్యక్తి. కాథలిక్ చర్చి లోని లోటుపాట్లకు సంబంధించిన విమర్శను వాపసు తీసుకోవడానికి నిరాకరించిన కారణంగా ఇతడు వెలివేయబడ్డాడు.

నూర్జహాన్: విభజనకు మునుపు భారత దేశపు సువిఖ్యాత గాయకురాలు. నటిగా 50 సంవత్సరాల క్రితం భారతీయుల హృదయాలను దోచుకుంది. ఆమె నటించిన కొన్ని మరపురాని చిత్రాల

## నాకు బదులు బట్టతల వ్యక్తిని మేల్కొల్పాడు

ఒక మంగలి, ఒక బట్టతల మనిషి, ఒక ప్రొఫెసర్ కలిసి ప్రయాణం చేస్తున్నారు. ఎవరూ లేని ఏకాంత ప్రదేశంలో ఒక రాత్రి గడుపవల్సి వచ్చింది. వంతుల ప్రకారం మేల్కొని వారి వస్తువులకు కాపలా కాయాలన్న నిర్ణయానికి వారు వచ్చారు.

మంగలి మొదట మేల్కొని ఉండేందుకు ఒప్పుకున్నాడు. ఆట పట్టించాలని నిద్రపోతున్న ప్రొఫెసర్ తలను నున్నగా ఆమంగలి గుండు చేసాడు. మంగలి తన వంతు సమయం అయి పోయిన వెంటనే ప్రొఫెసర్‌ను మేల్కొలిపాడు.

నిద్రలేచిన ప్రొఫెసర్ తన తలను ఒకసారి తడుముకున్నాడు. తలపై వెంట్రుకలు లేని సంగతి తెలుసుకున్నాడు. విసుగుతో ఆ ప్రొఫెసర్ 'ఎక్కడ ఆవెధవ? నాకు బదులు బట్టతల వ్యక్తిని మేల్కొలిపాడు'' అంటూ చిందులు వేసాడు.

"పగిలిన గాజును, పింగాణీను సరిగ్గా అతికించలేనట్లే కోల్పోయిన పరపతిని తిరిగి పొందలేము." — బెంజమిన్ ఫ్రాంక్లిన్

పేర్లు: ఖాన్‌దాన్, జీనత్, జుగ్నూ అన్‌మోల్ ఘడి మొదలైనవి. దేశ విభజన తరువాత పాకిస్తాన్‌కు తరలి వెళ్ళి పోయింది. అక్కడ అగ్రగణ్య నటిగా రాణించింది.

సర్ ఎడ్మండ్ హిల్లరి: న్యూజిలాండ్ దేశానికి చెందిన పర్వతారోహకుడు. గొప్ప అన్వేషి. 1953 వ సంవత్సరం మే నెలలో ప్రపంచపు అతి ఎత్తైన ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించిన ఇద్దరిలో ఇతడొకడు. కామన్ వెల్త్ ట్రాన్స్ అంటార్కిటిక్ బృందంతో కలసి భూమార్గం ద్వారా1 958 వ సంవత్సరంలో దక్షిణ ధృవాన్ని (South Pole) చేరాడు. 1960వ సంవత్సరం ఇతను హిమాలయాలను అన్వేషించాడు.

హిరోహిటో: మాజీ జపాను చక్రవర్తి. 1946వ సంవత్సరంలో రాజులు దైవాంశ సంభూతులన్న వాదానికి స్వస్తి చెప్పి రాజరికాన్ని ప్రజలకు చేరువ చేసాడు. మెరైన్ బయాలజి (సముద్రంలో జీవించే ప్రాణుల అధ్యయన శాస్త్రం) పట్ల ఇతను ఎక్కువగా మక్కువను చూపాడు.

జెరెమి బెంధామ్ (Jeremy Bentham): ఆంగ్లేయ దార్శనికుడు. యుటిలిటేరియనిజమ్ (ఉపయోగితావాదం)ను ఇతడు ప్రారంభించాడు. "బహుజనుల సుఖశాంతుల కోసం ఉపయోగపడే చట్టాలను అమలు పరచడమే అసెంబ్లీ ప్రధాన ఉద్దేశ్యంగా ఉండాలి" అని ఇతను వాదించాడు.

●


Kody Rammoorthy

'రామ్మూర్తి సాండోగా' గుర్తించబడిన ఆచార్య కోడి రామ్మూర్తి వదహారణాల ఆంధ్రుడు వారు ఒక సర్కస్ కంపెనీను నడిపేవారు. ఆయన ఎన్నో అద్భుతాలను ప్రదర్శించేవాడు. తన నడుము చుట్టూ తాళ్ళను కట్టుకునేవాడు. తాళ్ళ రెండు కొసలను రెండు మోటారు వాహనాలకు కలిపి ముడివేసేవారు ఆ తరువాత రెండు వాహనాలను ఏకకాలంలో రెండు దిశలలో నడిపేవాడు వాహనాల జోరుకు ఎక్కడ రామ్మూర్తి శరీరం చిరిగిన విస్తరిలా తయారవుతోందన్న భయంతో జనం ఊపిరి బిగపట్టి చూసేవారు. ఏమాత్రం ఉద్రేకం లేకుండా రామ్మూర్తి రెండువాహనాలను అసలు కదలకుండా చేసేవాడు. తన అరచేతులలో వాహనాల్ని ముందుకు తోస్తూ కదలకుండా చేసేవాడు. ఆయన నూటికి నూరుపాళ్ళు శాకాహారి. ఈరోజు అటు ఆంధ్రులు, ఇటు సర్కస్ ప్రియులు అతన్ని మరచిపోలేదు.

"అందంగా లేమని అద్దాన్ని నిందించడం వంటిదే పరిస్థితుల మీద నెపం వేసి తప్పుడు పనులు చేయడం." — మైకేల్

# ప్రతిరోజును మీ జీవితపు ఆఖరోజుగా భావించి జీవించండి

* ఈరోజన్నది దయాళువైన భగవంతుడు మనకిచ్చిన గొప్ప వరం. ఈ రోజును వినయంతో, కృతజ్ఞతాభావంతో స్వీకరించి ప్రేమతో ఉద్దేశపూర్వకంగా జీవించండి మీ ముందున్న ఈ రోజును సంతోషంతో, ఉత్సాహంతో పంచుకోండి మీ రోజును సృజనాత్మకమైన పనులలో తెలివిగా వాడండి.




* ఈ రోజును దిగులు నుండి దూరంగా ఉండే రోజుగా పరిగణించండి.

* ఈ రోజును అర్థవంతంగా గడిపి రేపటి రోజును గొప్ప రోజుగా మార్చుకోండి.

* ఈరోజు కృతజ్ఞతాపూర్వకంగా జీవించండి. నిస్సంకోచంగా దానం చేయండి. అలసట, విసుగును మరచి భగవంతుణ్ణి ప్రార్థించండి.

* ఈరోజు ముఖ్యమైన పనులను ఎన్నుకుని వాటికి ప్రాధాన్యతనిస్తూ పూర్తి చేయవలసిన రోజుగా భావించండి

* తన ప్రతిరోజును ఆశ, ప్రోత్సాహం, విశ్వాసం, చిరునవ్వులతో ప్రకాశించేలా చేయగల వ్యక్తే ధన్యుడు.

* ఈరోజు కనీసం ఇద్దరు వ్యక్తులకు మీ కృతజ్ఞత తెలుపవలసిన అవసరం ఉంది· మీరు! మరియు మరొకరు

భగవంతుడు మీకు 86,400 సెకండ్ల కాలాన్ని ఈ రోజు వరంగా ఇచ్చాడు. అందులోని కనీసం ఒక సెకండయినా "ధన్యవాదాలు" అని చెప్పడానికి వాడండి.

* ఉదయించిన ప్రతి రోజును మరొక రోజుగా భావిస్తారా? లేదా అదే మీ జీవితపు ఆఖరిరోజని జీవిస్తారా?

* ఈ రోజు చిరునవ్వులను చిందిస్తుంది. సంతోషంతో గడపండి. నిస్సంకోచంగా ఇవ్వండి.

* ప్రయోజనాత్మకంగా జీవించడానికి ఈ రోజు కొత్త అవకాశాన్ని ఇస్తున్నదని భావించండి. శ్రద్ధతో వినండి, నిదానంగా మాట్లాడండి.

— విల్లియం ఆర్థర్ వార్డ్

[illegible]

# మీరు మూఢనమ్మకాలను నమ్ముతారా?

కె.ఎన్. త్యాగి

మూఢనమ్మకాలను నమ్మేవారిని అన్ని రంగాలలోనూ మనం చూస్తుంటాము. గుర్రపు పందెంలో పాల్గొనేముందు చబుకు కిందపడిపోవడాన్ని కొంతమంది జాకీలు (Jockeys) అపశకునంగా భావిస్తారు. మంచి అదృష్టం వరించాలని ఆశించే క్రీడాకారులు ఉమ్మివేయడం మనం చూస్తున్నాము. తమ డ్రస్సింగ్ రూమ్‌లో ఈల వేయడాన్ని అశుభంగా భావించే నటులు ఉన్నారు.




సంఖ్యలన్నింటిలో 13 అన్న సంఖ్యను చాలా చెడ్డ సంఖ్యగా భావించడం జరుగుతోంది. చాలావరకు హోటళ్ళలోగానీ, కార్యాలయాలలోగానీ 13వ అంతస్తు ఉండదు. కొన్ని విమాన కంపెనీలు తమ విమాన ప్రయాణాల్ని 13వ ప్రయాణంగా పిలవడానికి ఇష్టపడరు. అంతేకాదు వారి విమానాలలో 13 సంఖ్యగల వరస ఉండదు.

13వ తారీఖు శుక్రవారంతో చేరినప్పుడు తీవ్రమైన చెడు జరుగుతుందని చాలా మంది భావిస్తున్నారు. కొన్ని పాత వ్రాత ప్రతులలో 'ఆదామ్' భార్య 'ఈవ్' ఆపిల్ పండును శుక్రవారం రోజే తిన్నదనీ, ఆ రోజే ఈడన్ గార్డెన్ నుండీ ఆదామ్, ఈవ్‌లు బహిష్కరింపబడ్డారని రాసి ఉంది. బైబిల్‌లో వర్ణింపబడిన గొప్ప ప్రళయం కూడా శుక్రవారమే సంభవించిందనీ, శుక్రవారం రోజే కేయిన్ (Cain) తన సోదరుడైన ఏబెల్ (Abel)ను చంపాడనీ రాసి ఉంది. ఏసుక్రీస్తును శిలువ చేయడం కూడా శుక్రవారం రోజునే జరిగింది.

ఒకసారి బ్రిటిష్ నౌకా విభాగానికి చెందిన కొంతమంది అధికారులు శుక్రవారం అన్నది అశుభమైన దినం కాదని నిరూపించ దలిచారు. ఒక కొత్త నౌకను శుక్రవారం

## 5వ స్థానంలో ఉన్న సిమెంట్ ఉత్పత్తి

చైనా, రష్యా, జపాన్, యుఎస్ఎ తరువాత సిమెంట్ ఉత్పత్తిలో భారతదేశం 5వ స్థానంలో ఉంది. ప్రపంచపు సిమెంట్ ఉత్పత్తిలో భారత దేశం వంతు సుమారుగా 5 శాతం.

—'ఎకనామిక్ టైమ్స్' సౌజన్యంతో

"ప్రతి ఇల్లు ఒక విశ్వవిద్యాలయమే, ప్రతి తల్లిదండ్రులూ అధ్యాపకులే"

— గాంధీజీ

రోజు సిద్ధం చేసి, ఆ నౌకకు Friday అని నామకరణం చేసి శుక్రవారం రోజునే జలప్రవేశం చేయించారు అంతేకాకుండా ఫ్రైడే అని పేరున్న నౌకాధికారి నేతృత్వంలో శుక్రవారం రోజే ప్రయాణం ప్రారంభించేలా చేసారు. కొంతదూరం ప్రయాణం చేసిన తరువాత సిబ్బందితో సహా ఆ నౌక కను మరుగైంది 90 విమాన ప్రమాదాలు జరిగిన వారానికి సంబంధించిన లెక్కలను పరీక్షించగా అందులో 14 విమాన ప్రమాదాలు మాత్రం శుక్రవారం రోజు జరిగాయనీ, అందులో ఏ ఒక్క ప్రమాదం 13వ తేదీన జరగలేదని తేలింది

పదార్థాలను నిలువ ఉంచే సాధనంగా ఉప్పును అందరూ అనాదిగా పరిగణిస్తున్నారు ఆ కారణంగా స్థిరమైన స్నేహానికి ఉప్పును ఒక చిహ్నంగా గుర్తించడం జరిగింది అందుకే ఉప్పును వృధా చేయడం అన్నది ఒక స్నేహితుణ్ణి పోగొట్టుకోవడంతో లేదా ప్రాణాలను పోగొట్టుకోవడంతో సమంగా భావింపబడుతోంది ఉప్పు అన్నది ఒకప్పుడు చాలా విలువైన, చాలా అరుదైన వస్తువుగా పరిగణింపబడేది అందుకనే ఉప్పు జారవేయడాన్ని ఒక విపత్తుగా, అశుభ సూచకంగా ప్రజలు అనుకోసాగారు కాని జపానులో మాత్రం ఉప్పు జారవేయడాన్ని శుభసూచకంగా గ్రహిస్తారు

కొన్ని ప్రాంతాలలో ఒక నిచ్చెన కింద నడవడాన్ని అశుభంగా భావిస్తారు తర్కంతో ఆలోచించినప్పుడు అలా అను కోవడం సబబే అనిపిస్తుంది. నిచ్చెన పైన నిలబడి పనిచేస్తున్న వ్యక్తి చేతుల నుండీ పనిముట్లు లేదా ఇటుకలు లేదా పెయింట్ డబ్బా లేదా నీళ్ళ బిందె లాంటివి జారి నిచ్చెన కింద నడిచే వ్యక్తి తలపై పడే అవకాశాలు ఉన్నాయి. నిచ్చెనను అశుభంగా అనుకోవడానికి బహుశ మరొక విషయం కూడా కారణం అయివుండ వచ్చును గోడకు ఆనించి నిలబెట్టబడిన నిచ్చెన త్రికోణం అవుతుంది. ఆదిమ క్రైస్తవులు త్రికోణాన్ని త్రిమూర్తులకు గుర్తుగా భావించేవారు ఆకారణంగా నిచ్చెన కింద నడవడం దేవతల స్థానంలో ప్రవేశించడం అవుతుంది మరి దేవతల పవిత్రస్థలంను దాటడం లేదా తొక్కడం పాపం అవుతుందని అలా చెప్పి ఉంటారు.

ప్రతిరోజు మన నిత్య జీవితంలో మనం ఏదో ఒక మూఢనమ్మకాన్ని ఏదో ఒక విధంగా మనం చేసే పనులలో లేదా ఆలోచనలలో ఎదుర్కొంటూనే ఉంటాము కుడి అరచేయిని జిల కారణంగా రుద్దారను కోండి మీ అర చేయి డబ్బులతో నిండి కళకళలాడుతుందనీ, మీ పాదం అరికాలులో జిల లాంటిది కలిగిందంటే మీరు దూర ప్రయాణం చేయవలసి వస్తుందనీ, కన్ను అదరడం జరిగితే చెడ్డరోజులు రానున్నా యనీ నమ్ముతారు మన ఇంటిపైన కాకి అరుస్తే మన ఇంటికి బంధువులు వస్తారని అర్థం ప్రయత్నంలో జయం కలుగనున్నదో లేదా అపజయం కలుగనున్నదో తెలుసుకోవ డానికి గాలిలో నాణాన్ని ఎగురవేసి పట్టు కోవడం ఒక నమ్మకం ●

' హృదయ శిక్షణతో ముడిపడని మానసిక శిక్షణ నిరుపయోగమైనది ''

— గాంధీజీ

## తన సొంత పనిని చేసుకునేవాడు

అంతర్ముఖుడు (Introvert) తన కాలాన్నంతా తన సొంత పనికే గడిపేవాడు.

## అద్భుతమైన పూర్వీకుడు!

ఒక లోభితో జీవించడం సంతోషకరమైనది కాదు. అయితే అతనొక అద్భుతమైన పూర్వీకుడు కాగలడు.



## వీడ్కోలు సందేశం

విమాన ప్రయాణం చేస్తున్న ఒక వ్యక్తికి ఆయన మిత్రుడు "ఆ భగవంతుడూ, నీ సామాన్లూ ఈ రెండూ నీతో ప్రయాణం చేయుగాక" అని వీడ్కోలు సందేశం ఇచ్చాడు.

## అర్థం చేసుకోవడం చాలా కష్టం

ప్రకృతి అద్భుత దృశ్యాలను ప్రశంసించేందుకు వేలకొలది మైళ్ళు ప్రయాణం చేసి ఆ తరువాత ఆ స్థలాన్ని చెత్తా చెదారంతోనూ, సారాసీసాలు, బీరు డబ్బాలతోనూ నింపే వ్యక్తిని అర్థం చేసుకోవడం చాలా కష్టం.

## ప్రపంచ చరిత్రను మార్చవచ్చును

మనిషి స్వభావాన్ని మార్చవచ్చును. ఇది ఒక ప్రాథమికమైన సమాధానం జాతీయ ఆర్థిక వ్యవస్థను మార్చవచ్చును. అది సమాధాన ఫలం. ప్రపంచ చరిత్రను మార్చవచ్చును. అది మన యుగపు తలరాత.

— డా॥ ఫ్రాంక్ బుచ్‌మన్

## ప్రపంచం రెండు వర్గాలుగా విభజింపబడింది

సామాన్యంగా మాట్లాడుకుంటున్నప్పుడు ఈ ప్రపంచాన్ని రెండు వర్గాలుగా విభజించవచ్చును. మొదటి వర్గం వారికి

## రెడిమేడ్ దుస్తుల

భారతదేశంలోని తమిళనాడు రాష్ట్రం రెడిమేడ్ దుస్తుల ఎగుమతిలో ఇతర రాష్ట్రాల కంటే ఎంతో ముందుంది. తమిళనాడులోని మద్రాసు, తిరుప్పూర్‌లు ముఖ్య ఎగుమతి కేంద్రాలుగా రాజిల్లుతున్నాయి.

అర్హతలు ఏమాత్రం లేకపోయినా అన్నీ సమకూరుతుంటాయి. రెండవ వర్గానికి చెందినవారికి ఎన్నో అర్హతలుండి కూడా కొంచమే సమకూరుతుంది.

— హెర్బర్ట్ స్పెన్సర్



## మగవాడి కారు తుడుస్తున్న మహిళ

మగవాడు ఒక మహిళ కారును తుడుస్తున్నాడనుకోండి. అప్పుడు వారిద్దరూ పెండ్లి చేసుకోవాలని నిశ్చయించుకున్నారని అర్థం. అదే ఒక మహిళ మగవాడి కారును తుడుస్తున్నదనుకోండి. అప్పుడు వారిద్దరు వివాహం చేసుకున్నారని అర్థం.

## వర్షం - కరువు

ఒక రాజకీయ పార్టీ వర్షాలు మా వల్లే కురుస్తున్నాయని గొప్పలు చెప్పుకుంటే ప్రతిపక్షాల వారు దేశంలోని కరువుకు కారణం కూడా అదే పార్టీ అని ఆరోపణ చేస్తే ఆశ్చర్యపడ కూడదు.

## కాఫీ విరామాలు లేవు

పాతకాలంలో ప్రజలు కాఫీ విరామాలతో కాకుండా పనితో కాలాన్ని గడిపేవారు

## ఒక పనిని చేయడానికి మూడు మార్గాలు

ఒక పనిని చేయడానికి మూడు చక్కని మార్గాలు ఉన్నాయి: 1. మీరే ఆ పనిని చేయడం, 2. ఆ పనిని చేసేందుకు ఇతరులను నియమించడం, 3. ఆ పనిని చేయవద్దని మీ పిల్లలతో చెప్పడం.

●

## పాలకొలను - నీటికొలను

తమకు పోస్తున్న పాలలో నీళ్ళు కలుపుతున్నాడని ఒకసారి ఒకఊరి నుండీ ఆపల్లె ప్రజలు ఒక మునలివానిని తరిమివేసారు. పక్కపల్లెలో నివసిస్తున్న ఒక సాధువు వద్దకెళ్ళి సహాయం చేయమని చిత్తశుద్ధితో ఆ మునలివాడు కోరాడు. ఆ మునలాడికి అభయమిస్తూ ఆ సాధువు "నీవు బాధపడవద్దు. పాలకొలనును నీకోసం సృష్టిస్తాను. నీవు అమ్మగలిగినంత పాలు అమ్మి సంతోషంగా జీవించు" అని అన్నాడు. సాధువు చెప్పిన పాలకొలను సంగతి ఆ మునలాడికి అంతగా రుచించలేదు. దీనికి మించినది కావాలనుకున్నాడు. ఆ ఉద్దేశంతోనే ఆ మునలాడు సాధువుతో వినయంగా "అయ్యా మీరు రెండు కొలనులను నిర్మించండి - పాలకొలను, నీటికొలను - అప్పుడు నేను ఇంకా సంతోషంగా జీవించగలను" అని విన్నవించుకున్నాడు.

—ఐ.కె శశిధరరావు నిర్గీ, పూనె.

... ప్రారంభమైన ప్రతి పరిచయం ... వాటుతుంది

... వైల్డ్

# గొప్ప ఆంగ్లేయకవులు

## మిల్టన్

జోసఫ్ డి'సౌజా

శ్రేష్ఠమైన ఆంగ్లేయ కవులలో మిల్టన్ ఒక గొప్పకవి. 1608వ సంవత్సరం డిసెంబరు నెల 9 వ తారీఖున ఇతను లండన్‌లో జన్మించాడు. లండన్‌లోని సెయింట్ పాల్ పాఠశాలలో ఇతడు చదువు కున్నాడు. 16 సంవత్సరాల వయసులో మిల్టన్ క్రైస్ట్ కళాశాలలో చేరాడు. ఇక్కడ మిల్టన్ ఏడు సంవత్సరాల కాలాన్ని గడిపాడు.




వీరోచితంగా ఉంటూ మిల్టన్ పలురకాలైన ఆటలలో అందర్ని మించిపోయేవాడు. కాలేజీలో చదువుకుంటున్నప్పుడే ఇతడు తొలిదశకు చెందిన కవితలు రాసాడు. ఇందులో ముఖ్యమైనవి - ఆన్ షేక్స్‌పియర్, ఆన్ ది డెత్ ఆఫ్ ఎ ఫెయిర్ ఇన్‌ఫెంట్, ఆన్ ది మార్నింగ్ ఆఫ్ క్రైస్ట్స్ నేటివిటి, ది ఎపిటఫ్ ఆన్ ది మేర్ లయనస్ ఆఫ్ విన్‌ఛెస్టర్ అన్నవి.

ఎం.ఏ. పరీక్ష పాస్ అయిన తరువాత హార్టన్‌లో ఉన్న తండ్రి వద్దకు మిల్టన్ వెళ్ళిపోయాడు. కష్టపడి చదువును కొన సాగిస్తూ అయిదు సంవత్సరాల కాలాన్ని మిల్టన్ ఇక్కడ గడిపాడు. 1637 వ సంవత్సరంలో మిల్టన్ తల్లి కన్ను మూసింది. ఆ తరువాత ఐరోపా ఖండం యాత్రకు మిల్టన్ బయలుదేరాడు.

ఫ్లొరెన్స్ (Florence) వద్ద మిల్టన్ "టస్కాన్ చిత్రకారుడు" (Tuscan Artist) అయిన గెలీలియో (Galileo) ను కలిసాడు. 1642 వ సంవత్సరంలో రాజ వంశానికి చెందిన మేరీ పోవెల్ (Mary Powell) ను ఇతడు పెండ్లాడాడు. వార్తా పత్రికల స్వాతంత్ర్యం కోసం తీవ్రంగా విజ్ఞప్తి చేసిన ఆర్యోపగిటికా( Areopagitica) అనే

---

### వ్యక్తిగతమైన ఫోన్లు కూడదు

ఒక హోటల్లో: "ఆఫీసులో మా బాస్ సొంత ఫోన్లు చేయనివ్వరు. నా భార్యా కూతురు ఇంట్లో సొంతఫోన్లు చేయనివ్వరు."

---

"పొగిడించుకునేందుకే మనం ఇతరులను పొగుడుతుంటాము."

— లా రోచెఫాకాల్డ్

అందరికీ పరిచయమైన గద్యరచనను ఇతడు అప్పట్లో చేసాడు. ఈ పుస్తకం 1644 లో ప్రచురింపబడింది.

శ్రమతో అధ్యయనం చేయడంవల్ల 1652వ సంవత్సరంలో మిల్టన్ కను చూపును పోగొట్టుకున్నాడు. కాథరీన్ ఉడ్‌కాక్ (Catherine Woodcock) ను ఇతడు 1656 వ సంవత్సరంలో పెండ్లి చేసుకున్నాడు. ఒక శిశువుకు జన్మనిచ్చిన 15 నెలల తరువాత ఈమె చనిపోయింది రెండవ ఛార్లెస్‌కు 1660 వ సంవత్సరంలో అధికారం హస్తగతం కావడంతో మిల్టన్ తన హోదాను పోగొట్టుకున్నాడు.

ఉరి తీసే వ్యక్తి మిల్టన్ పుస్తకాలను తగులబెట్టాడు. అతని ప్రాణాలకు ప్రమాదం ఏర్పడింది. 1662 వ సంవత్సరంలో మూడవసారి మిల్టన్ పెండ్లి చేసుకున్నాడు. ఆయన జీవితపు సంధ్యాకాలంలోనే పారడైజ్ లాస్ట్, పారడైజ్ రీగైన్డ్ అన్న రెండు గొప్ప రచనలతో పాటు సామ్‌సన్ అగోనిస్టస్ అన్న నాటకం కూడా ప్రచురితమైంది. పారడైజ్ లాస్ట్ అన్నది మిల్టన్ రచించిన అత్యుత్తమమైన రచన. ఈ రచనకు కావలసిన తయారీను అతను మొదట నుండీ చేస్తూ వచ్చాడు.

ఇంగ్లీషు భాషను మాట్లాడేవారి ప్రియతమ కవిగా ఖ్యాతి నార్జించిన మిల్టన్ 1674 వ సంవత్సరంలో మరణించాడు. చిరస్మరణీయుడైన మిల్టన్ అన్ని కాలాలకు, అన్ని దేశాలకు చెందిన గొప్ప కవి.

# మహిళాలోకం

## గృహిణికి చిట్కాలు

* మీ ఇంటి తలుపులు కీచుమంటున్నాయా? తలుప మడత బందులకు కొంచెం సోపును రాయండి. అదేవిధంగా తలుపుపక్కలకు కూడా రాయండి. కీచుశబ్దం కొన్ని క్షణాలలో మాయమవుతుంది.



* చల్లటి పానీయాల మూతను ఉపయోగించి సబ్బును ఆదా చేయండి. ఒకటి లేక రెండు మూతలను సోపు వెనకాల భాగంలో అతికించండి.

* కేబేజీ ఉడుకుతున్నప్పుడు చిన్న అల్లం ముక్కను అందులో వేయండి. అల్లం కేబేజీకి రుచికరమైన వాసనను ఇస్తుంది.

* కొత్త దారం మృదువుగా మార్చాలనుకుంటున్నారా? సోపునీళ్ళలో ఆ దారాన్ని ముంచి చూడండి. గఱుకుతనం మాయమై దారం సున్నితంగా, మృదువుగా తయారవుతుంది.

"రాజకీయాలను రాజకీయ నాయకులకు, రాజకీయ ఆర్థిక వ్యవస్థను కళాశాల అధ్యాపకులకు వదలకూడదు." — హెన్రీ జార్జ్

# ఈ శతాబ్దంలో

## అంతరిక్షంలో 'హేపీ బర్త్‌డే టు యూ' గానం

1969వ సంవత్సరం మార్చినెల 8వ తారీఖున అపోలో 9లోని అంతరిక్ష నావికులు అంతరిక్షంలో మొట్టమొదటిసారిగా 'హేపీ బర్త్‌డే టు యు' అన్న ఇంగ్లీషు పాటను పాడారు

## 200 సంవత్సరాల తరువాత పేలిన జ్వాలాముఖి




బంగాళాఖాతంకు చెందిన అండమాన్ లోని పోర్ట్ బ్లేర్‌కు ఈశాన్యంగా 110కి.మీల దూరంలో 'బేరెన్ ఐలాండ్'లో ఉన్న జ్వాలాముఖే మనదేశపు సజీవ జ్వాలాముఖి. ఈ జ్వాలాముఖి కేంద్ర వృత్తాకార కూచి ఎత్తు 300 మీటర్లు (984 అడుగులు). 1991వ సంవత్సరం ఏప్రిల్ నెల 10వ తారీఖున ఈ జ్వాలాముఖి ప్రేలింది. ఈ విస్ఫోటం కారణంగా, బండలు, గుండ్లు, లావా చాలా దూరం వరకు విసిరివేయబడ్డాయి. ఈ జ్వాలాముఖి సుమారు 200 సంవత్సరాల తరువాత పేలింది. ఇంతకుముందు 1803వ సంవత్సరంలో ఇది పేలింది.

## మొట్టమొదటిసారిగా తీయబడిన శుక్రగ్రహ చిత్రాలు

శుక్రగ్రహానికి అతి చేరువుగా చేరి మొట్టమొదటిసారిగా అక్కడి చిత్రాలను యు ఎస్. మారినర్ - II భూమికి 1962వ సంవత్సరం డిసెంబరు నెల 14వ తేదీన పంపింది.

## ప్రపంచ యుద్ధాన్ని ఆపుచేసేందుకు

అమెరికా దేశపు అధ్యక్షుడు,

## నేను ఇంటికి త్వరగా వెళుతున్నాను

ప్రఖ్యాత ఆంగ్లేయ రచయిత చార్లెస్ లాంబ్ లండన్‌లోని ఇండియా హౌస్‌లో పనిచేసేవాడు ఒకరోజు ఆఫీసులో ప్రవేశిస్తున్న లాంబ్‌ను ఆపి ఆ ఆఫీసు ఉన్నతాధికారి "లాంబ్‌గారు మీరు తరచు ఆలస్యంగా వస్తున్నారు" అన్నాడు

లాంబ్ ఏ మాత్రం ఆలోచించకుండా వెంటనే "అయ్యా నేనుఇంటికి కూడా త్వరగా వెళుతున్నానన్న సంగతి మీరు మరచిపో తున్నారు" అన్నాడు.

సోవియెట్ యూనియన్ ప్రధానమంత్రుల మధ్య అకస్మాత్తుగా ప్రారంభమయే యుద్ధాలను ఆపుచేసే ప్రయత్నాలు చేయడంకోసం 1963వ సంవత్సరం ఆగస్టు నెల 30వ తారీఖున ఒక హాట్‌లైన్ స్థాపన జరిగింది.

## 909వ మొదటి తరగతి మాచ్‌లో 1000వ గోలు

Pele—Famous Football Star



బ్రెజిల్‌కు చెందిన సువిఖ్యాత సాకర్ ఆటగాడైన పీలె (Pele) తన 1000వ గోలును 1969వ సంవత్సరం నవంబరు నెల 19వ తారీఖున వేసాడు. తన ఫుట్‌బాల్ జీవితపు 909వ మాచ్‌ను సాంటాస్ జట్టు తరపున ఆడుతున్న తరుణంలో 1000వ గోలును వేసాడు.

## ఐక్యరాజ్య సమితి పుట్టుక

50 సంవత్సరాల ముందు 1945వ సంవత్సరం, అక్టోబరు నెల 24వ తారీఖున 51 దేశాలకు చెందిన నాయకులు కాలిఫోర్నియా రాష్ట్రానికి చెందిన శాన్‌ఫ్రాన్సిస్కో వద్ద కలిసి ఒక పత్రంపై సంతకం చేసారు. ఆ విధంగా విశ్వశాంతి కార్యక్రమం నిజమైన రూపుదాల్చింది. ఆ తరువాత ఐక్యరాజ్య సమితి జన్మించింది.

## పుష్‌బటన్ టెలిఫోన్లు

1963వ సంవత్సరం నవంబరు నెల 18వ తారీఖున అమెరికాకు చెందిన బెల్ టెలిఫోన్ పుష్‌బటన్ టెలిఫోన్లను ప్రవేశ పెట్టింది.

## హిందూ మహాసముద్రం నుండి బహులోహ సంబంధ గ్రంథులు

గోవాకు చెందిన నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఓషనోగ్రఫీ వారికి సొంతమైన పరిశోధనా నౌక 'గవేషిణి' 1981 జనవరి 26న బహు లోహ సంబంధమైన గ్రంథులను హిందూ మహా సముద్రంలో 36 కి.మీల లోతు ప్రాంతంలో సమీకరించింది. నికెల్, రాగి, కోబాల్ట్, మాంగనీస్, ఇనుము మొదలైన లోహాలను ఆ గ్రంథులు కలిగి ఉన్నట్లు వారు గ్రహించారు. భవిష్యత్తులో సముద్రం

## ఖండాంతర క్షేపక క్షిపణి

*ఒక ఖండాంతర క్షేపక క్షిపణి (Inter Continental Ballistic Missile) తయారీకు అయ్యే ఖర్చుతో మిలియన్ హెక్టేర్ల భూమికి కావలసిన నీటి పారుదలకు సౌకర్యాన్ని సమకూర్చవచ్చు. అంతేకాదు 65,000 గ్రామీణ వైద్యశాలలను నిర్మించవచ్చును లేదా 50 మిలియన్ల పిల్లలకు ఆహారాన్ని సమకూర్చవచ్చును.*

"అదృష్టం కోసం కాచుకున్న వ్యక్తికి భోజనం తప్పక దొరుకుతుందన్న నమ్మకం ఉండదు."
— బెంజమిన్ ఫ్రాంక్లిన్

లోని ఈ గ్రంథులలోని ఖనిజాలు భూమిలోని ఖనిజాలకు బదులుగా ఉపయోగించుకోవచ్చును.

## 1976వ సంవత్సరంలో స్వతంత్ర దేశంగా మారిన సెచెల్లెస్




హిందూ మహాసముద్రంలోని మొరిషియస్ దీవులకు అటువైపుగా బ్రిటిష్ వారి ఆధీనంలో గత 160 సంవత్సరాలుగా ఉన్న సెచెల్లెస్ ద్వీప సమూహం 1976వ సంవత్సరం జూన్ నెల 29వ తారీఖున స్వాతంత్ర్యాన్ని పొంది రిపబ్లిక్‌గా మారింది.

## అతి తక్కువ ధరకు అమ్ముడు పోతున్న పేరెన్నిక గన్న కారు

అమెరికా దేశస్థుడు మరియు పారిశ్రామిక వేత్త అయిన హెన్రీ ఫోర్డ్ మొత్తం ప్రపంచంలో బాగా ప్రచారంలో ఉన్న పేరెన్నిక గన్న మోడల్ T చౌక కారును 1908వ సంవత్సరం అక్టోబరు నెల 1వ తారీఖున ప్రవేశపెట్టాడు. ఎడమచేతి వైపు నడుపబడే తొలి కారు కూడా ఇదే.

## మొట్టమొదటిసారి స్వతంత్రంగా జరిగిన పోర్చుగల్ ఎన్నికలు

పశ్చిమ యూరప్‌లోని పోర్చుగల్‌లో ఆదేశపు తొలి స్వతంత్ర ఎన్నికలు 50 సంవత్సరాల తరువాత మొదటిసారిగా 1975వ సంవత్సరం ఏప్రిల్ నెల 26వ తారీఖున జరిగాయి.

## 1960లో ప్రారంభమైన ఎస్.టి.డీలు

సబ్‌స్క్రైబర్ ట్రంక్ డయలింగ్ (STD) పద్ధతి మనదేశంలో తొలిసారిగా 1960వ సంవత్సరం నవంబర్ నెల 26వ తారీఖున ప్రారంభింపబడింది ఉత్తరప్రదేశ్ లోని లక్నో - కాన్పూర్‌ల మధ్య ఈ పద్ధతిని అప్పుడు ప్రారంభించారు. ●

## ఆశియా ఖండపు తొలి పార్లమెంట్ సభ్యుడు

*ప్రతిష్ఠాత్మక సంస్థ అయిన అంతర్జాతీయ పార్లమెంటేరియన్స్ ఫర్ గ్లోబల్ అక్షన్‌కు దక్షిణ బొంబే లోక్‌సభ నియోజక వర్గం నుండి ఎన్నికైన శ్రీ మురళీ డియోరా, అంతర్జాతీయ అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. ఈ సంస్థలో 80 దేశాలకు చెందిన 1000 మంది ఎన్నుకోబడిన వ్యక్తులు సభ్యులుగా ఉన్నారు. ఇటువంటి ప్రతిష్ఠాత్మకమైన సంస్థ అధ్యక్షుడుగా ఎన్నికైన శ్రీ మురళీ డియోరా ఆ పదవికి ఎన్నుకోబడిన మొట్టమొదటి ఆశియా ఖండపు పార్లమెంటు సభ్యుడు.*

— *'బిజినెస్ ఇండియా' సౌజన్యంతో*

"సలహాను ఇచ్చినంత ధారాళంగా మరి దేన్నీ ఇవ్వలేము."

— లా రోచెఫౌకాల్డ్

డా॥ ముఖేష్ బత్రు

గవదబిళ్ళలు ఒక రకమైన భయంకర అంటువ్యాధి. మెడ ప్రక్క భాగంలోని పరాటిడ్ గ్రంథుల వాపు దీనికి కారణం. ఈ వ్యాధి సాధారణంగా పిల్లలకు, యువ వయోజనులకు సంక్రమిస్తుంది. యజమానికి సోకిన వ్యాధి అప్పుడప్పుడు పెంపుడు కుక్కలకు, పిల్లులకు కూడా సోకుతుంటుంది. ఈ అంటువ్యాధి చలి కాలంలో ఎక్కువగా సోకుతుంది.




ఈ వ్యాధి సుమారు రెండు మూడు వారాల తేడాలో ముదురుతుంది. సాధారణంగా ఈ వ్యాధి ముదరడానికి 14 మొదలు 35 రోజులు పడుతుంది. పరాటిడ్ (Parotid) గ్రంథి వాపును ఈ వ్యాధి తొలి లక్షణంగా భావించాలి. ఈ వాపుకు ఒకటి లేక రెండు రోజులు ముందు దవడ, మెడ భాగాలు బిగుసుకుపోవడం, నొప్పిగా ఉండడం జరుగుతుంది. అప్పుడప్పుడు వాపుకు ముందు జ్వరం రావడం, దేహంలో వణుకుపుట్టడం, గొంతునొప్పి లాంటి లక్షణాలు కూడా బయటపడుతుంటాయి.

పరాటిడ్ గ్రంథివాపు మొదట్లో ఒక పక్కమాత్రం - సాధారణంగా ఎడమవైపు మాత్రం - కనబడుతుంది. రెండు మూడు రోజుల వరకు వాపు పరిమాణం పెరుగుతూ ఉంటుంది. ఈ వాపు సాగి మెరుస్తున్న సంచి ఆకారంగా మారుతుంది. కొన్ని రోజుల తరువాత వాపు తగ్గిపోతుంది. అప్పుడప్పుడు ఈ వాపు రెండవవైపుకు కూడా వ్యాపిస్తుంది.

మొదట్లో ఒక పక్క కనబడే వాపు నాలుగైదు రోజుల తేడాలో రెండోవైపుకు కూడా వ్యాపిస్తుంది. మెడ రెండువైపుల

---

## మా అబ్బాయి చరిత్ర పాఠాలు బాగా చదువుతున్నాడా?

తండ్రి (అధ్యాపకుడితో): మా అబ్బాయి చరిత్ర పాఠాలు బాగా చదువుతున్నాడా? నేను చదువుతున్నప్పుడు, మీకు గుర్తు ఉంటుందను కుంటాను. నాకు చరిత్ర అంటే బొత్తిగా గిట్టేది కాదు.

అధ్యాపకుడు: చరిత్ర మళ్ళీ మళ్ళీ జరుగుతుంది.

---

"తాను సంపాదించిన సొమ్ము ఉత్తమము. తండ్రి సొమ్ము మధ్యమము. ఆడదాని సొమ్ము అధమము."

వాపు వ్యాపించినప్పుడు ముఖం రూపు రేఖలు మారి వ్యక్తి అందవిహీనుడవుతాడు. 101 నుండి 102 డిగ్రీల ఫారన్‌హీట్ వరకు జ్వరం వస్తుంది. ఈ జ్వరం రెండు మూడు రోజులు ఉంటుంది.

అటువైపు, ఇటువైపు కనబడే ఈ గ్రంథి వాపువల్ల ఒక ఉద్రిక్తతాభావం కలుగు తుంటుంది. బాధ కంటే కూడా బిగుతుతనం ఎక్కువగా ఉంటుంది. మింగుతున్నప్పుడు, నములుతున్నప్పుడు లేదా వండ్లను కదలిస్తున్నప్పుడు నొప్పి కలుగు తుంటుంది.

పిచ్చుకాయ వాపు (Orchitis)కు, వృక్వక వాపు (Pancreatitis)కు ఈ వ్యాధి సోకిన మగపిల్లలు గురి అవుతారు. ఈ వ్యాధికి గురైన వారిలో 25 శాతం మగపిల్లలకు పిచ్చుకాయ వాపు సాధారణంగా ఏర్పడుతుంది. యుక్తవయస్సుకు చేరనున్న మగపిల్లలకు ఇది సోకుతుంది.

వాంతి, అశక్తత (Collapse), 103 మొదలు 104 డిగ్రీల ఫారన్‌హీట్ వరకు జ్వరం మొదలైనవి పిచ్చుకాయవాపు కారణంగా వస్తాయి. సాధారణంగా పిచ్చుకాయ వాపు ఒకవైపే ఉంటుంది. 15 శాతం వ్యాధిగ్రస్తుల రెండవ పిచ్చుకాయ కూడా వాపుకు గురి అవుతుంది.

వాపుతోపాటు జ్వరం కూడా ఒక వారం రోజులలో తగ్గిపోతుంది. యుక్త వయస్సుకు రావడానికి ముందే రెండు పిచ్చుకాయలు గవదబిళ్ళల కారణంగా వాపుకు గురైనప్పుడు ఆ వ్యక్తి ఎదుగుదలను పరీక్షించడం మంచిది.

## కష్టేఫలి




*రాత్రికి రాత్రి ఎదిగిపోవడం, అకస్మాత్తుగా విజయాన్ని సాధించడం పరిపాటి అయిన ఈ రోజుల్లో రాబర్ట్ హాల్ ఇంటర్నేషనల్ (Robert Hall International) వారు వ్యాపార రంగంలో విజయాన్ని సాధించేందుకు ఉపయోగ పడే రహస్యాలను క్రోడీకరించారు. ఈ సంస్థ వారు వివిధ కంపెనీలకు చెందిన ఉపాధ్యక్షులను, డైరక్టర్లను కలిసి మీ విజయానికి తోడ్పడిన అతి ముఖ్య అంశాన్ని సూచించవలసిందిగా కోరారు. ఆ ప్రశ్నకు 21 శాతం వారు 'తెలివి తేటల'నీ, 9 శాతం 'అనుభవం' అనీ, 6 శాతం 'వ్యక్తిత్వం' అనీ సమాధానం ఇచ్చారు. 52 శాతం వారు మాత్రం "కష్టపడి పనిచేయడం" అని సమాధానం ఇచ్చారు. మిగతావారు తమ విజయాలకు కారణమైన ముఖ్యమైన విషయమేదో తమకు తెలియదని సమాధానం ఇచ్చారు.*

(— సెల్ఫ్ ఇంప్రూవ్‌మెంట్ మాన్యువల్)

"చింతకు బదులుగా పని చేపట్టినప్పుడు చేకూరే ఆనందం సాటి లేనిది." — మారిస్ మేటర్‌లింక్

స్త్రీలు ఈ వ్యాధికి గురైనప్పుడు అండాశయం, స్తనాలు సమస్యలకు గురౌవుతాయి.

పాన్‌క్రియాస్ (కడుపు వెనకాల ఉన్న శ్లేహరసాన్ని ఉత్పత్తి చేసే గ్రంథి) వాపు, సాధారణంగా పిచ్చుకాయ వాపంత బాధ పెట్టదు. కానీ అప్పుడప్పుడు పిచ్చుకాయ వాపులాగా పాన్‌క్రియాస్ బాధకు కారణం గవదబిళ్ళ అయివుంటుంది. పొత్తి కడుపులో విపరీతమైన నొప్పి, జ్వరం, వాంతులు లాంటి రోగ లక్షణాలు కనపడినప్పుడు గవదబిళ్ళ వ్యాధికి గురైనట్లు అనుమానించవలసి వస్తుంది. ఈ లక్షణాలు గ్రంథుల కారణంగా మెడచుట్టూ వాపును సూచిస్తాయి.

గవదబిళ్ళకు గురైనప్పుడు మలబద్ధకం కారణంగా మల విసర్జనలో రక్తం చారలు ఉండడానికి అవకాశాలు ఉన్నాయి.

గవదబిళ్ళ కారణంగా చనిపోవడం చాలా అరుదుగా జరుగుతుంది. అయిదు సంవత్సరాలలోపు పిల్లలలో ఇతర సమస్యలు ఏర్పడినప్పుడు మరణం సంభవిస్తుంది.

మొదటి రెండు మూడు రోజుల వరకు గవదబిళ్ళ వాపు అంటువ్యాధిగా ఉంటుంది. రెండువారాల వరకు వీరిని ఇతరుల నుండీ దూరంగా ఉంచడం మంచిది.

గవదబిళ్ళకు గురైనవారి నోటిని శుభ్రంగా ఉంచాలి. వాపు ఉన్నప్పుడు నమిలే ఆహార వస్తువులను కాకుండా ద్రవ రూపంలో ఉన్న ఆహారం - పండ్ల రసం లాంటిది ఇవ్వడం మంచిది.

హెూమియోపతి మందు బెల్లడొన్నా 200 (Belladonna) వాడితే వాపు తగ్గుతుంది. పల్‌సటిల్లా 200 (Pulsatilla 200)ను వాడి గవదబిళ్ళ కారణంగా వచ్చే చిక్కులను చాలావరకు అరికట్టవచ్చును. ●

## అతి పెద్దదైన డిష్ దూరదర్శిని



Largest Dish Radio-Telescope at Arecibo, Puerto Rico (USA)

*యుఎస్ఏలోని ప్యూయర్టో రికో (Puerto Rico) కు చెందిన అరెసిబో (Arecibo) వద్ద ప్రపంచపు అతి పెద్దదైన డిష్ దూరదర్శిని నిర్మాణం జరిగింది. దీని వ్యాసం 1,000 అడుగుల దాకా ఉంటుంది. ఒక డిష్ 18½ ఎకరాల వరకు విస్తరించి ఉంటుంది. రేడియో తరంగాల తేజః కేంద్రంపై దృష్టిని సారించి అంతరిక్షంలోని వస్తువుల నుండీ ప్రసారం అయ్యే వాటిని రిసీవర్ (అందుకునే కేంద్రం)కు అందజేస్తుంది. ఈ సంకేతాలను ఎలక్ట్రానిక్ పద్ధతులలో విస్తరింపజేసి కంప్యూటర్ ద్వారా అధ్యయనం చేస్తారు.*

"చట్టం అంతమైనప్పుడు నిరంకుశత్వం ప్రారంభమౌతుంది."
— విలియం పిట్

బి.పి. హరిచంద్ర

మీ సమయాన్ని సక్రమంగా ఉపయోగించుకునేందుకు క్రింది సలహాలను పాటించండి.

1. ప్రతిరోజు ఉదయం లేచిన వెంటనే ఆ రోజు పూర్తి చేయవలసిన పనులను గుర్తు చేసుకోండి. ఈ విషయంగా మీరు తయారుచేసుకున్న ప్రణాళికలను అమలు పరచండి. అంతేకాని ప్రణాళికలను



తయారు చేసుకోవడం ఆ ప్రకారం నడుచుకోవడం కోసం మీ సమయాన్ని వృథా చేయకండి. పడుకునే ముందు పక్షపాత రహితంగా ఆరోజు మీరు చేసిన పనులను బేరీజు వేసుకోండి.

2. మీ సమయం సద్వినియోగం కావాలని ఉదయం లేచి దేవుణ్ణి ప్రార్థించి ఆశీస్సులను కోరండి. అప్పుడే మీ సమయం సక్రమంగా, లాభదాయకంగా గడుస్తుంది.

3. ప్రతి పనిని ఒక ప్రణాళికతో ప్రారంభించండి. ఆ ప్రణాళికను చక్కగా ఆలోచించి తయారు చేసుకోండి.

4. క్రమం తప్పకుండా కావలసిన మేరకు నిద్రపోయే అలవాటును చేసుకోండి. సోమరితనాన్ని వదులుకోండి.

5. ఇతరుల ఇంటికి మరీ తరచుగా పోవడం తగ్గించుకోండి.

6. పనికిరాని పుస్తకాలను చదవడం మానండి.

7. మీ మనసుకు విసుగు కలిగినప్పుడు మీ సమయాన్ని వృథా పోనీయకుండా ఉపయోగకరమైన పుస్తకాన్ని చదవండి.

8. పగటి కలలు కనడం మానండి.

9. ఒక్క ముక్కలో చెప్పాలంటే 'సమయం' అన్నది భగవంతుడు మనకు ప్రసాదించిన ఒక అమూల్య కానుక. కాబట్టి, చాలా పొదుపుగా, జాగ్రత్తగా వాడుకోండి. చాలామంది అమూల్యమైన ఈ కానుకను వ్యర్థపరుస్తుంటారు. వీరు తమ మరణ శయ్యపై పడుకున్నప్పుడు పశ్చాత్తాపపడి దుఃఖిస్తారు. ●

## ఎయిడ్స్ వైరస్

*1984*వ సంవత్సరం ఏప్రిల్ నెల *23*వ తారీఖున ఎయిడ్స్ వైరస్‌ను కనుగొన్నట్లు అమెరికా సంయుక్త రాష్ట్రాలు ప్రకటించాయి.

"ఒకళ్ళనొకళ్ళు చూసుకోవడం కాదు. ఇద్దరు కలిసి ఏకోన్ముఖంగా చూడటమే 'ప్రేమ' అనిపించుకుంటుంది." — ఎక్స్‌ఫెరీ

# [illegible] అధిరోహించిన భారతీయ మహిళలు

డి.కె.ఓ

ఇండో టిబెటన్ సరిహద్దు దళాలకు చెందిన యువతి సంతోష్ యాదవ్ తన ఇద్దరు సహచరులతో - కుంగా బుటియా, డిక్కీ డోల్మా - కలసి 1993వ సంవత్సరం మే నెల 10వ తారీఖున భయాన్ని వితిని కలిగించే ఎవరెస్ట్ శిఖరాన్ని రెండుసార్లు అధిరోహించిన ఏకైక మహిళగా ప్రపంచంలో గుర్తింపును పొందింది ఆరు రోజుల తరువాత, అంటే 1993వ సంవత్సరం మే నెల 16వ తారీఖున నలుగురు సభ్యులున్న మరో మహిళా బృందం - డిపు శర్మా, రాదాదేవి, సుమన్ కుటియాల్, సవీత మర్తోలియా - భయాన్ని కలిగించే ఎవరెస్టు



Mount Everest

వీరందరూ ఇండో నేపాలీస్ ఎవరెస్ట్ ఎక్స్‌పెడిషన్ (సహయాత్ర) 1993 బృందంలోని సభ్యులే. ఈ బృందానికి ఎవరెస్ట్‌ను అధిరోహించిన తొలి భారతీయ మహిళ బచేంద్రీ పాల్ - నాయకత్వం వహించింది



Bachendri Pal – Mountaineer and Everest conqueror

సరిగ్గా 1992వ సంవత్సరం మె నెల 12వ తారీఖున ఇండో టిబెటన్ సరిహద్దు పోలీసుదళాల సహయాత్ర బృందం సభ్యురాలిగా, సంతోష్ యాదవ్ ఎవరెస్ట్‌ను అదిరోహించింది ఆ విదంగా సంతోష్ ఎవరెస్ట్ శిఖరాన్ని అదిరోహించిన రెండవ మహిళగా (బచేంద్రిపాల్ తరువాత)

## పిల్లలంటే చాలా ఇష్టం!

ఒక దుకాణంలోని బోర్డు
అమ్మకానికి
మేలురకం జాతికి చెందిన బుల్‌డాగ్,
ఇంట్లో తర్ఫీదు ఇవ్వబడింది
అన్నీ తింటుంది పిల్లలంటే చాలా ఇష్టం.

"మనకు జరగనంత వరకు ఇతరుల అన్ని విషయాలు తమాషాగానే ఉంటాయి."

— విల్ రోజర్స్

గుర్తింపు పొందింది. హిమాచల్ ప్రదేశ్ రాష్ట్రంలోని మనాలికు చెందిన యువతి




డికీ డోల్మా మరో ప్రపంచ రికార్డును సృష్టించింది. మొత్తం ప్రపంచంలోనే ఇంతటి పిన్నవయసులో ఎవరెస్ట్ శిఖరాన్ని




అధిరోహించిన వ్యక్తి మరొకరు లేరు. అప్పట్లో డికీ డోల్మా వయసు 19 సంవత్సరాలు మాత్రమే. — 'యోజన' సౌజన్యంతో

## ఆహ్వానం లేకుండానే వచ్చిన అలెగ్జాండర్

*1962వ సంవత్సరం గ్రీస్ దేశపు రాజు భారతదేశాన్ని అధికార పూర్వకంగా దర్శించడానికి వచ్చాడు. అప్పటి రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణ వచ్చిన అతిథిని ఆహ్వానిస్తూ "మహాశయా! గ్రీసుదేశం నుండి అతిథిగా మా దేశానికి వచ్చిన మొదటి మహారాజులు మీరు. అప్పట్లో అలెగ్జాండర్ ఆహ్వానం లేకుండా మాదేశం వచ్చాడు."*

---


**STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS about Newspaper "WISDOM" Madras - 600 004.**

**Form IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | : Madras |
| 2. | Periodicity of Publication | : Monthly |
| 3. | Printer's Name | : K.V. GOVINDA RAO |
| | Nationality | : INDIAN |
| | Address | : Printed at M/s Desh Publications (P) Ltd., 267-B, Royapettah High Road, MADRAS - 600 014. |
| 4. | Editor's & Publisher's Name | : K.V. GOVINDA RAO |
| 5. | Nationality | : INDIAN |
| 6. | Address | : 9, Desika Road, Mylapore, MADRAS - 600 004. |
| 7. | Name & Address of individuals who own the Newspaper and Partners | : WISDOM PUBLICATIONS 9, Desika Road, Mylapore, MADRAS - 600 004. |

I, K.V. Govinda Rao hereby declare the particulars given above are true to the best of my knowledge and belief.

Date: 1.3.96
Madras - 600 004.

(Sd)
K.V. GOVINDA RAO
EDITOR & PUBLISHER
"WISDOM"


"లోకజ్ఞులు వర్తమాన విషయాలు ప్రస్తావిస్తారు. అవివేకులు తాము భవిష్యత్తులో కట్టబోయే మేడలను గురించి చెబుతారు." — చెఫిని

## ....అంటే నేను ప్రధాన ద్వారం గుండా రాలేనంటారా?

ఒకసారి బాంకు ఉద్యోగులు సమ్మెచేసారు. ఇద్దరంటే ఇద్దరు మాత్రం ఆరోజు పని చేయడానికి రావడం జరిగింది.

- ఒక మహిళ బాంకుకు ఫోను చేసి "ఈరోజు బాంకు ఉందా?" అని అడిగింది.

- "అవునండీ, కానీ రెండు విండోలను (కౌంటర్లు) మాత్రం తెరచి ఉంచాము."

- "అలాగా.. అంటే నేను ప్రధాన ద్వారం గుండా బాంకులో ప్రవేశించ లేనన్న మాట."



## నాకు విశ్రాంతి అవసరం

"మీ భార్యను విశ్రాంతి కోసం ఊరికి పంపడం గొప్ప విషయం"

"అవునండి నాకు విశ్రాంతి చాలా అవసరం."

## మీ అభిప్రాయాన్ని మార్చుకుంటారు

అతడు: "ప్రపంచంలో ఏ ఇద్దరూ ఒకేలా ఆలోచించరన్న వాదాన్ని నేను ఇప్పటికీ సమర్థిస్తాను."

ఆమె: "మన వివాహానికి మనకివ్వ బడిన బహుమతులను చూచారంటే మీ అభిప్రాయాన్ని తప్పక మార్చుకుంటారు."

## ఫిబ్రవరి నెలకు 28 రోజులు ఉన్నందువల్లనే

"గత నెలలో పిల్లలు ఎందుకు తక్కువ అల్లరి చేసారంటారు?"

"గత నెలలో అంటే ఫిబ్రవరి నెలలో 28 రోజులు మాత్రమే ఉండడం వల్లనే."

## ఇప్పుడు అమ్మడానికి పరువు మాత్రం మిగిలింది

అధ్యాపకుడు: "మీనాన్న ఇంకా పని చేస్తున్నారా?"

## మనిషి జీవితం ఒక ప్రయాణం

మనిషి జీవితం ఒక ప్రయాణం. రహదార్లు బాగాలేకపోయినా లేదా సరైన విడిది దొరక్క పోయినా ఆగకుండా చేయవలసిన ప్రయాణం ఇది!

— ఆలివర్ గోల్డ్‌స్మిత్

"ఇతరుల దురదృష్టంలో నీ సంతోషాన్ని వెతుక్కోవద్దు." — సైరస్

రాజు: “అవునండి! ఆయన ఫర్నిచర్ అమ్ముతున్నారు.”

అధ్యాపకుడు: “మరైతే వారు బాగా అమ్ముతున్నారా?”

రాజు: “అవునండీ! ప్రస్తుతం అమ్మడానికి ఒక్క పరుపు మాత్రమే మిగిలింది.”



## అది విరిగింది కదా!

ప్రకాష్ తల్లిని చాలా ఇబ్బంది పెట్ట సాగాడు. దుకాణంలో కనిపించిన ప్రతి వస్తువు కావాలని మారాము చేసాడు. తల్లికి విసుగేసి గట్టిగా “ప్రకాశ్ మరైతే చంద్రుడు నీకు వద్దని, ఖచ్చితంగా చెప్పగలవా?”

ప్రకాశ్: (ఆకాశంలోని చంద్రుణ్ణి చూసి విసుగుతో)“ లేదమ్మా! చంద్రుడు నాకు వద్దు. ఆ బింబం విరిగిపోయింది కదా.”

## బ్రహ్మచారులకు మంచి గృహాలుంటాయి

ఒక బ్రహ్మచారి ఫ్లాటును సందర్శించిన వివాహితుడు ఆ బ్రహ్మచారి ఫ్లాటును పొగడసాగాడు: “ఇది చాలా బాగుంది. నాకు కూడా ఇటువంటి ఫ్లాటు ఉంటే ఎంతో బాగుండేదనిపిస్తోంది” అని అన్నాడు.

ఆ బ్రహ్మచారి జవాబిస్తూ, “పెండ్లైన వారికి మంచి గృహిణులుంటారు. మాబోటి బ్రహ్మచారులకు మంచి గృహాలు ఉంటాయ”ని చమత్కరించాడు.

## అలా చేయవలసి వచ్చేది

పర్సనల్ డైరక్టరు (ఇంటర్వ్యూ చేస్తూ) “మరి మీకు అనుభవం ఏమైనా ఉందా?”

అభ్యర్థి: “నేను సెక్రటరీగా ఉండేవాడిని. అప్పుడు అమ్మాయిలా కనబడి, మనిషిగా ఆలోచించి ఒక మహిళగా వ్యవహరించి,

## ప్రతి సంవత్సరం 10.000 పైగా జారీ అవుతున్న తపాలా బిళ్ళలు

ప్రపంచంలోని *170*కు మించిన దేశాలలో ప్రతి సంవత్సరం *10,000*కు మించిన స్టాంపులు జారీ అవుతున్నాయి.

## భవిష్యత్తును నమ్మవద్దు

“భవిష్యత్తు ఎంత మనోహరంగా ఉన్నాసరే నమ్మకు
గతించిన గతాన్ని గతం లోతుగా పాతిపెట్టని
జీవిస్తున్న వర్తమానంలో కార్యశీలుడవు కమ్ము
హృదయాన్ని విశ్వాసంతో, మెదడును
భగవద్భక్తితో నింపుకో”

—లాంగ్ ఫెలో

“సామాన్యులు ప్రార్థించరు, అ[illegible]స్తారు.” — జి.బి.షా.

కుక్కలా పని చేయవలసి వచ్చేది."

## నాకు డబ్బు మాత్రం కావాలి

ఒకసారి భగవంతుణ్ణి ప్రార్థిస్తున్న ఒక చిన్న కుర్రాడు, "ఒక ఏనుగును కొనగలిగినంత డబ్బు నావద్ద ఉంటే ఎంత బాగుండేది" అని గొణుక్కున్నాడు. ఆ కుర్రాడి మాటలను విన్న ఒక పెద్ద మనిషి, "చూడబ్బాయి. నీవు ఏనుగును కొని ఏమి చేయాలనుకుంటున్నావు" అని ప్రశ్నించాడు. "ఏనుగు ఎవరికి కావాలి? నాకు కావల్సింది డబ్బు మాత్రమే" అని ఆకుర్రాడు జవాబిచ్చాడు.

## అరగంట ఆలస్యంగా లేవండి

రాజు (డాక్టరుతో): "లేచిన అరగంట వరకూ నాకు తలతిరుగుతున్నట్లు ఉంటుంది. ఏమి చేయమంటారు?"

డాక్టరు: "అలాగా! రేపటి నుండీ రోజు అరగంట ఆలస్యంగా లేవండి."

## మీ వెనకాల కాలెండరు ఉందికదా!

ఒక వక్త ఏకథాటిగా రెండుగంటలకుపైగా ప్రసంగించాడు. ఆ తరువాత సభికులను ఉద్దేశించి, "నేను చాలాసేపు మాట్లాడినట్లున్నాను. క్షమించండి. నా చేతికి వాచి లేదు" అన్నాడు.

"సరే మీ వెనకాల కాలెండరు ఉంది కదా!" అని ఒక సభికుడన్నాడు.

Barrel – Cactus



*మధ్య అమెరికా మెక్సికోలో పెరిగే బార్రెల్ కాక్టస్ (పీపా ఆకారంలో పెరిగే ముళ్ళ జెముడు చెట్టు) సుమారు 18 మొదలు 20 అడుగుల ఎత్తుకు పెరుగుతుంది. ఇదొక సజీవమైన రెఫ్రిజరేటర్. ఇందులో 30 గాలన్లకు మించిన చల్లటి నీరు నిలువ ఉంటుంది. ఈ నీరు కారణంగా చెట్టు చల్లగా ఉంటూ మండే ఎండాకాలంలో కూడా పూలుపూసి పండ్లు కాస్తుంటాయి. ఈ రకంగా నీరు నిలువ ఉంచుకునే చెట్లను ఎడారి జంతువులు తమ దప్పికను తీర్చుకునేందుకు సమీపిస్తాయి. అందుకనే ప్రకృతి ఈ ముళ్ళ జెముడుకు వాడి అయిన ముళ్ళను ప్రసాదించింది. ఈ ముళ్ళ చెట్టు బయట భాగం జంతువుల నుండీ కాపాడుతుంది.*

## గ్రంథాలయ అధికారి

*జ్ఞాన సాగరంలో ఉంటూ ఒక చుక్క కూడా దొంగిలించలేని వ్యక్తి గ్రంథాలయ అధికారి.*

— హెచ్.డి. శర్మ

"ప్రజల వద్ద లేనిది బలం కాదు, మనోబలమే" — విక్టర్ హ్యూగో

# మనదేశంలోని కుటుంబ జీవితం

తెల్మా మెనిజెస్

ఒకప్పుడు ఉమ్మడి కుటుంబంలో - తాతలు, అవ్వలు, పిల్లలు, అత్తలు, మామలు అందరూ కలిసి ఒక ఇంటిలో కానీ, పక్కపక్క ఇండ్లలో గానీ జీవించేవారు. వీరు తమ వనరులను పంచుకునే వారు. పండుగలను కూడా కలిసి జరుపుకునేవారు. కష్టాలలో వారు ఒకరినొకరు ఆదుకునేవారు.




ఇంటిపేరు నడపడమన్నది, కుటుంబ బాధ్యతగా ఉండేది. ఈ పద్ధతిలో కొన్ని ఇబ్బందులు, కష్టనష్టాలు ఉన్నా మొత్తం మీద సాఫీగా నడిచిపోయేది. వయసు మళ్ళిన వారికీ, రోగాలతో బాధపడేవారికీ, నిరుద్యోగులకు ఈ పద్ధతి సంరక్షణను కల్పించేది.

ఈ రోజు కుటుంబం అన్న మాటకు నిర్వచనం మారిపోయింది. రోజురోజుకు పెరుగుతున్న ధరల కారణంగా, మంచి ఉద్యోగం, మంచి భవిష్యత్తు ఇవి రెండూ చదువుకున్న వారిని ముఖ్యంగా ఉద్యోగాలు చేసుకుంటున్న యువదంపతులను, తాము పెరిగిన కుటుంబ వాతావరణం నుండీ, దూర ప్రాంతాలకు తీసుకువెళు తున్నాయి. ఈ యువ దంపతులు నివసించడానికి అనువైన ఇల్లు, ఆదుకోవడానికి సహాయకులు, పిల్లల్ని చూసు కోవడానికి కావలసిన పెద్దలు లేక ఆర్థిక ఇబ్బందులకూ, మానసిక ఒత్తిడులకూ, ఇబ్బందులకూ గురి అవుతున్నాయి. దాంపత్య నమ్మకద్రోహం, త్రాగుడు, భార్యా పిల్లల మానసిక ఉద్రిక్తత కలిసి కుటుంబ సామరస్యంపై పెద్ద దెబ్బ తీస్తున్నాయి. పిల్లలు కూడా ఈ రకం కుటుంబాల కారణంగా, బయటి ప్రభావాల కారణంగా ఒత్తిడులకు గురి అవుతున్నారు. వార్తా పత్రికలలో ప్రచురించబడుతున్న వార్తల ఆధారంగా యువత ఈనాడు హింసాకాండకు,

## ఏడు ఇన్నింగ్సులలో 6 సెంచురీలు

*మొదటి తరగతి క్రికెట్ ఆటలలో మన దేశపు క్రికెట్ వీరుడు విజయ్ మర్చెంట్ 1940 - '41, 1941 - 42 లో ఆడిన ఏడు ఇన్నింగ్స్‌లలో ఆరు సెంచరీలను కొట్టాడు.*

"అనుగ్రహాన్ని కోరడం అంటే మన స్వతంత్రాన్ని బదులుగా ఇవ్వడమే."

మత్తు మందులకు, వ్యభిచారానికి అలవాటు పడుతోందనీ, స్త్రీల పట్ల దారుణంగా వ్యవహరిస్తున్నదనీ మనం తెలుసుకోగలుగుతున్నాము

మనదేశంలోని కుటుంబ వ్యవస్థ ప్రస్తుతం కొన్ని కష్టాలను ఎదుర్కొంటున్నది ఒకరిని పనిచేసేవారిలా మరొకరిని పతనం అయ్యేలా మార్చుతున్నదేది? ఒక సాధారణ కుటుంబాన్ని కలతల్లేని పసందైన కుటుంబంగా మార్చగలిగే విషయాలను గురించి పరిశీలిద్దాం




కుంటుబ హక్కుల చార్టర్ (ఒప్పందం) ప్రకారం పిల్లల పుట్టుకకు తోడ్పడే వివాహ పద్ధతిని కుటుంబంగా నిర్వచించడం జరిగింది. వివాహం అన్నది ఒక రకమైన బాధ్యత పరస్పర సహకారాన్ని, త్యాగాన్ని, బాధ్యతల్ని ఓపికను, అర్థం చేసుకోవడాన్ని పెంపొందించుకునేందుకు వివాహం తోడ్పడుతుంది మరైతే ఈ విధంగా జరుగుతోందా?

ఈ రోజు వివాహం అన్నది పైమెరుగుల-రంగు, జాతి, కులం మతం, ఆర్థిక పరిస్థితులు, హోదా - కారణంగా జరుగుతోంది ఈ రకం పద్ధతిలో వధూవరులు ఒకరినొకరు అర్థం చేసుకోవడానికి ఏ మాత్రం అవకాశం దొరకడం లేదు వివాహాలు భారీ ఎత్తున ఆర్భాటాలకు ప్రాధాన్యతను ఇస్తున్నాయి ఎంత భారీగా జరుగుతున్నాయో అంత వేగంగా విడాకులకు దారితీస్తున్నాయి పరస్పరం ప్రేమించుకున్న యువకులు ప్రేమ వివాహాల పరిణామం

[illegible]

## జవాబులు

**క్విజ్:** 1 (సి) అస్సాం 2 (బి) నాగేంద్ర సింగ్ 3 (సి) ఇజ్రాయిల్ 4 (డి) యునైటెడ్ కింగ్‌డమ్‌లోని ఒక నక్షత్ర గణితశాల 5 (సి) హాకీ 6 (డి) మహారాష్ట్ర 7 (ఎ) అనేక దేశాలలో వ్యాపారం చేస్తున్న కంపెనీ 8 (ఎ) 1896 జనవరి 23వ తారీఖున

**మాటల మహిమ:** 1 (సి) పిమ్మట 2 (ఎ) చల్లదనం 3 (బి) సమయము 4 (డి) సమష్టి 5 (ఎ) నట్టిల్లు 6 (డి) వీణాదండము 7 (ఎ) అన్నము 8 (బి) నడితల

**తెలివికి పరీక్ష:** 1 కీ.శే. దేవుల కృష్ణశాస్త్రి 2 కీ శే విశ్వనాథ సత్యనారాయణ 3 వేయిపడగలు - సహస్రఫణ్ పేరుతో 4 పాంచజన్యం 5 72 కండరాలు ●

"పొగడ్తకు మించిన శ్రావ్యమైన సంగీతం మరేది లేదు' — క్సెనొఫొన్

ఎలా ఉంటుందో ఆలోచించకుండానే పెండ్లి చేసుకుంటున్నారు.

పాఠశాలలకు పోతున్న పిల్లలపై ఒత్తిడిని చూస్తున్నాము. పాఠశాలకు సంబంధించిన బరువును వారు తమ శక్తికి మించి మోస్తున్నారు. ఇది చాలదనకుండ విద్యలో ముందుకు రావాలన్న తపన కూడా వారికుంటోంది. వివిధ విషయాలకు సంబంధించిన వివరాలను వారు తమ మిత్రుల నుండి పొందుతున్నారు. వారు సంపాదించిన వివరాలు వారిని తరచుగా తప్పుదారిని పట్టిస్తున్నాయి. వారు సరైన వివరాలను పూర్తిగా గ్రహించలేకపోతున్నారు వారు అనునిత్యం చూస్తున్న సినిమా, టెలివిజన్‌ల లోని శృంగార దృశ్యాలు, పబ్లిసిటి పేరుతో ప్రకటనలలో ఉట్టిపడుతున్న కామోద్రేకపు బొమ్మలు ఇత్యాదులనుండి దిక్కుతోచని రీతులలో చిక్కుకునిపోతున్నారు.

పాఠశాలలను వదిలి కాలేజి ఆవరణలో ప్రవేశించే సంధి కాలంలో యువకులు అనేక మార్పులకు గురౌతున్నారు. ముందుకంటే కొంచెం ఎక్కువ మోతాదులో స్వాతంత్ర్యం దొరకడం వల్ల మత్తుమందులకు అలవాటు పడే అవకాశాలున్నాయి. ఈ వయస్సు కారణంగా ఆడమగల మధ్య ఉన్న శారీరక సంబంధాల అవగాహన పెరగడం జరుగుతోంది. ఉన్నదున్నట్టు ఒక కొత్త ప్రపంచంలో అడుగు పెట్టడంతో అనుభవం లేని కారణంగా యువత ఒత్తిడులకు గురిఅవుతోంది.

యువత ఎదుర్కోబోతున్న సమస్యలను గురించి తెలియజేయవలసిన బాధ్యత అటు తలిదండ్రుల మీద ఇటు విద్యా సంస్థలపైన ఉంది సినిమాల ద్వారా, [illegible]



Candle Tree

*దక్షిణ అమెరికాలోని కొన్ని ప్రాంతాలలో "బుష్ మాన్స్ కాండిల్"గా ప్రచారం పొందిన ఒక అద్భుతమైన చెట్టుంది ఈ చెట్టు కొవ్వొత్తుల లాంటి వాడి ఊచలతో కప్పబడి ఉంటుంది. ఈ ఊచలను వెలిగించినప్పుడు కొవ్వొత్తిలా ఇవి మండుతాయి. మధ్య అమెరికా ప్రాంతమైన పనామా అడవులలో మరో రకం విచిత్రమైన కొవ్వొత్తి చెట్లున్నాయి ఈ చెట్టు కొమ్మలనుండీ వందలకొలది కొవ్వొత్తుల లాంటి పొడవైన ఊచలు వేలాడుతూ ఉంటాయి. ఇవి 3 నుండి 4 అడుగుల వరకు పొడుగుతో పసుపు పచ్చ రంగులో ఉంటాయి. నిజం చెప్పాలంటే ఈ ఊచలు తమ బరువులో సగం బరువు కొవ్వు లాంటి పదార్థం ఇస్తుంది ఇవి నిజంగా ఆ చెట్టుకు సంబంధించిన పండ్లు, ఆపిల్ లాంటి వాసన ఈ పండుకు ఉంటుంది*

ఉపన్యాసాల ద్వారా, వర్క్‌షాపుల ద్వారా, సలహాల ద్వారా తల్లిదండ్రుల అధ్యాపకుల సమావేశాలు పిల్లలను దారితప్పకుండా ఉండేలా చూడాలి లైంగిక విద్యను పాఠ్య క్రమంలో ప్రవేశపెట్టడం వల్ల ఈ రోజు స్త్రీల పట్ల జరుగుతున్న అన్యాయాల్ని అరికట్టేందుకు అవకాశం ఉంది. అంతే కాకుండా స్త్రీలను సరిగ్గా అర్థం చేసుకుని, గౌరవించే గుణం కూడా అబ్బుతుంది ఆడపిల్లలు కూడా తమలోని స్త్రీత్వాన్ని ఇతరులు గౌరవించే విధంగా నడుచుకోవాలి. అలా నడుచుకోవడంలో వారు ఎలాంటి రాజీ పడకూడదు

విషయ విశ్లేషణల ద్వారా, చర్చల ద్వారా యువత ఏది గ్రహించాలో ఏది తిరస్కరించాలో తెలుసుకోవాలి తమ జీవితపు విలువలను వారే నిర్ణయించుకోవాలి. ఆ విలువల ప్రకారం జీవించేందుకు అవసరమైన క్రమశిక్షణను వారు అలవాటు చేసుకోవాలి. వారిలో దాగున్న సృజనాత్మక ప్రతిభకు సానబెట్టి సరైన మార్గం వైపు - సంఘసేవ, విద్యారంగం, కళలు, సంగీతం, చేతిపనులు - వారి దృష్టిని మళ్ళించాలి

ఆరోగ్యకరమైన కుటుంబాలు ఆరోగ్యకరమైన సమాజాలను ఏర్పరచగలుగుతాయి. ఈ రెండు ఉద్దేశాలతో కూడుకున్న వ్యవస్థను నిర్మించడానికి కావలసిన అనుకూల వాతావరణాన్ని సృష్టించాలి. తమ తమ మత సంబంధమైన విశ్వాసాలను, ఆధ్యాత్మిక విలువలను బోధించేందుకు ప్రతి తల్లిదండ్రులు పాటుపడాలి. భగవంతుడిపై నమ్మకం, ఆయన సూచించిన మార్గంపై నడవడం, ఆయన ఉపదేశాలను పాటించడం అన్నవి ఇతర అన్ని విలువలను అధిగమిస్తాయి. ఇది మనిషిలో ఆశను రేకెత్తిస్తుంది. ఆత్మబలంను పెంచుతుంది. తన చుట్టూ ఉన్న ఇతరులపై అతనికున్న నమ్మకాన్ని బలపరుస్తుంది ప్రతి మనిషిలోనూ మంచిని చూచేలా చేసి ప్రేమించేలా చేస్తుంది నమ్మకంలో ఉన్న అద్భుతశక్తిని అనుభవించగలిగేలా పిల్లలకు తర్ఫీదును ఇవ్వాలి

—'ప్రేమ్ మార్గ్' సౌజన్యంతో




## ప్రొఫెసర్ గోవింద్ స్వరూప్‌కు బిర్లా మెమోరియల్ అవార్డు

*పూనాలోని మహత్తర మెట్రోవేవ్ రేడియో టెలిస్కోప్ ప్రాజెక్ట్ డైరక్టరు ఆచార్య ఎస్సార్ గోవింద్ స్వరూప్‌గారికి ఎం.పి బిర్లా మెమోరియల్ అవార్డు 1995 బహూకరింపబడింది. రేడియో ఆస్ట్రానమీ రంగంలో వీరు చేసిన అద్భుతమైన సేవలకు గుర్తింపుగా వారికి ఈ అవార్డు లభించింది.*

## జి.ఎం. మోడి అవార్డు

*విజ్ఞాన శాస్త్రానికి సంబంధించిన గుజర్ మల్ మోడి 1995 అవార్డు ఆల్‌జీబ్రిక్ జియోమెట్రీ, ఆల్‌జీబ్రిక్ గ్రూప్స్‌కు చెందిన నిపుణుడు ఆచార్య కంజీవరం శ్రీరంగాచారి శేషాద్రిగారికి గణిత శాస్త్ర రంగంలో వారు గావించిన కృషికి గుర్తింపుగా ఇవ్వబడింది.*

"అదృష్టంలో మార్పన్నది జీవితపు స్వభావం"

# అది నేను మీకివ్వలేను

విజయవంతంగా వ్యాపారం చేసుకుంటున్న ఒక వ్యాపారి ఒకసారి నరాల వ్యాధికి గురి అయ్యాడు. అతడు మానసిక రోగనివారణ నిపుణుడిని (సైకియాట్రిస్ట్) చూడ్డానికి వెళ్ళాడు




కొంచెంసేపు మాట్లాడిన తరువాత "మీరు గ్రామ ప్రాంతాలలో ఒకసారి సంచరించి వచ్చారంటే కొంచం కుదుట బడతారని నేను అనుకుంటున్నాను. ఈ వ్యాపారం సందడి నుండీ సాధ్యమైనంత దూరం వెళ్ళిపోవడం మంచిది" అని ఆ సైకియాట్రిస్ట్ సలహా ఇచ్చాడు.

"నేను గ్రామసీమల్లోనే నివసిస్తున్నాను. మా ఇంటి చుట్టూ కొన్ని మైళ్ళ దూరం వరకు చెట్లు ఉన్నాయి. వచ్చిక బయళ్ళకు, తాజా గాలికి ఏమాత్రం మాకు కొరత లేదు" అని ఆ వ్యాపారి సమాధానం ఇచ్చాడు.

ఆ మాటలు విన్న ఆ సైకియాట్రిస్ట్ కొంత ఆలోచించి, "అయితే మీకు కొంత విశ్రాంతి అవసరం. కొన్ని రోజుల పాటు అన్ని సదుపాయాలున్న చోట మీ పనులను, మీరు కలవవలసిన వ్యక్తులను కూడా మరచిపోయి విశ్రాంతి తీసుకోవల్సిన అవసరం మీకుంది" అన్నాడు

"డబ్బుతో కొనగలిగిన అన్ని సదుపాయాలు, అన్ని సౌకర్యాలు నా దగ్గర ఉన్నాయి. ప్రతి సంవత్సరం అన్నింటికి దూరంగా ఉంటూ చాలా రోజులు నేను విశ్రాంతి కూడా తీసుకుంటూ ఉన్నాను."

"అలాంటప్పుడు మార్పుకోసం నాటకాలను సినిమాలను చూడడం ప్రారంభించండి."

"డాక్టరుగారు, నేను నాటకాలకు, సినిమాలకు వెళ్ళి వెళ్ళి విసుగెత్తిపోయాను"

ఓపిక నశించిపోయిన సైకియాట్రిస్ట్ ఆ రోగితో "చూడండి సార్! మీరు సరైన చోటుకు రాలేదు మీ ఆత్మకు శాంతి కావాలి. అది నేను మీకివ్వలేను" అని అన్నాడు.

(ఈస్ట్ అండ్ వెస్ట్ సీరీస్)

●

## అతి గొప్ప ఆపద

*గొప్ప లక్ష్యంతో లక్ష్యాన్ని చేరలేకపోవడంలో ఆపద అంటూ లేదు. కానీ తక్కువ లక్ష్యంతో లక్ష్యాన్ని చేరడంలోనే గొప్ప ఆపద దాగి ఉంది*

— నైట్స్ ట్రెజరీ ఆఫ్ ఇల్లస్ట్రేషన్స్

"మానవతను మించిన మతము లేదు."

